Sri Venkateswara University

Pre-University Examination 1958 & 59.

# VICTORY GUIDE

TO

# Naganandam - Palavelli

(Part II B. Group (B) Advanced Telugu)

Containing Introductions, Exhaustive Notes, Paraphrases, Critical essays, Annotations, topical Questions & Answers

By

Vidwan Sri BADI GURAVA REDDY,

*Telugu Pandit,*

V. R. COLLEGE, NELLORE.

CITY PUBLISHING HOUSE,

PRAKASHNAGAR, NELLORE-2.

 *1958* *[Price 2-0-0*

# — విజ్ఞప్తి —



1958-59 సంవత్సరములకు, 'ప్రీ యూనివర్సిటీ' పరీక్షలకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు (Part II.B. Group (B) Telugu Higher Standard – Drama & Prose) నిర్ణయించిన నాగానందము, పాలవెల్లి భాగములకు సంబంధించిన నోట్సును చక్కఁగా ముద్రించి విద్యార్థి లోకమునకు సమర్పించుటకు మే మెంతయు సంతసించుచున్నవారము.

నేఁటి విద్యార్థుల విద్యాప్రమాణములను వారి యవసరములను మనంబున నిడికొని, మాకుఁ గల యనుభవమును బురస్కరించుకొని, పరీక్షలకు ముఖ్యమని తోఁచిన విషయములనే యీ 'నోట్సు' భాగమునందు విపులముగాఁ జేర్చినాము. ప్రశ్నోత్తరములు ప్రతిపదార్థ తాత్పర్యములు, కవి విమర్శనాత్మకము సందర్భసహిత వ్యాఖ్యలు. మొదలుగాఁగల యంశము లీ 'నోట్సు' భాగమునందు సంతరింపఁబడినవి. పాఠప్రవచనమున ననుభవము గల పండితులచే రచింపఁబడిన యీ 'నోట్సు' విద్యార్థులకుఁ గల్పతరువుగాఁ బరిగణింపఁబడఁగలదని మా విశ్వాసము. ఈ నోట్సులోని గుణదోషములు పరికించునప్పుడు యుక్తములని తోఁచిన మార్పుల నేవైనను సూచించినచో మఱుసంవత్సరపు 'నోట్సు'న వానిని సవరించుకొని విద్యార్థి లోకమునకు మఱింత యుపకరించునట్లు చేయఁగలవారము. విద్వాంసులు, విద్యార్థులు మా యీ ప్రయత్నము నాదరించి, ప్రోత్సహింతురని విశ్వసించుచున్నారము.

ఇట్లు,

ప్రకాశకులు.

# విషయసూచిక

## నాగానందము



## పాలవెల్లి



——//o//——

# నాగానందము

## కథాసంగ్రహము



జీమూతవాహనుఁడు విద్యాధరచక్రవర్తియగు జీమూతకేతునకు కనుఁగుఁబుత్రుఁడు. అతఁడు ధీరోదాత్తనాయకులలో నుత్తమోత్తముఁడు, బోధిసత్త్వుఁడు, మహాసత్త్వుఁడు, దానవీరుఁడు, దయావీరుఁడు. సర్వదా పరోపకారదీక్షాపరతంత్రుఁడు. అతఁడు చక్రవర్తి పుత్రుఁడయ్యు రాజ్యసుఖముల ననుభవింప నొల్లక నిస్పృహాచిత్తుఁడుగను, దీనుల పాలిటి కల్పతరువుగను బరిగణింపఁబడుచుండెను. తరుణ వయస్కుఁడయ్యు గార్హస్థ్యవాంఛ లేక సదా తల్లిదండ్రుల సేవయందు నిమగ్నుఁడై వారి సుఖమే తన సుఖముగా భావించుచుండెడివాఁడు. రాజకార్యములను మంత్రుల చేతఁ బెట్టి, స్వశరీరమునందిగా సర్వముఁ బరార్థమునకే సమర్పింప వలయు ననెడి దీక్షతోఁ గాలముఁ బుచ్చుచుండెను.

అతఁ డట్లు నిరంతరపితృసేవాపరాయణుఁడుగ నుండఁగా నొకనాఁడు జీమూతకేతువు పుత్రు నుద్దేశించి "వత్సా మన నగర పరిసరముల బహుకాలమునుండి వెచ్చించుటచే సమిత్కుశపుష్పములుగాని, నీవారధాన్యములుగాని సంతృప్తిగ లభియించుట లేదు. ఇచటికనతిదూరముననున్న మలయపర్వతమున నివాసయోగ్యమగు నాశ్రమపద మొండు నిర్మించుకొని యచటఁ గాఁపురమున్న యోగ్యముగా నుండునని తన యభిప్రాయమును వెలిపుచ్చెను. అది కారణంబుగా జీమూతవాహనుఁడు పితరుల నితరశంక లేకయే మలయగిరికిఁ గొనిపోయి యొక కుటీరమున నిల్పి, పితృభక్తిపరాయణుఁడై యా వృద్ధుల కెట్టి ఛిద్రములను గలుగనీయక కంటికి ఱెప్పవలెఁ గాచుచుండెను.

ఇట్లుండ సిద్ధరాజపుత్రికయు, మిత్రావసువునకు సోదరియు నగు మలయవతి యను నొక యందగత్తె విద్యాధరచక్రవర్తిని భర్తనుగాఁ బడయఁగోరి, గౌరిని గూర్చి వ్రత మాచరించుచుండెను. గౌరియు నామె సంగీత విద్యావిజ్ఞానమునకు, నబలాజనదుర్లభమగు భక్తికి మెచ్చి విద్యాధర చక్రవర్తి యామెకు భర్త కాఁగలఁడని వరమిచ్చెను. మలయవతి సఖీజనపరివృతయై గౌర్యాలయమున లబ్ధకాంతిప్రముదితయై, గౌరి యెదుట నాసీనయై యుండ జీమూతవాహనుఁడు తన వేడుక చెలికానితోఁ గూడి యుబుసుపోక కటఁ దిరుగాడుచు, మలయవతి గానప్రభావముచే నాకర్షింపఁబడి, యామె యాసీనయై యున్న గౌర్యాలయమును సమీపించి, యా బింబాధరను జూచి యామె రూపరేఖాలావణ్యాదులను మెచ్చిఁ యామెను వలచి వలపించుకొనెను. మలయవతియు ప్రథమ దర్శనముననే నాయకునం దనురక్తయై చేటిమాటున నుండి యోర చూపుల నాతనిఁ జూచుచుండెను.

ఇట్లుండ శాండిల్యుఁడను తాపసుఁ డచటికిఁ బ్రవేశించి యన్యోన్యానురూపదర్శనులగు మలయవతీ జీమూతవాహనులను దిలకించి మిక్కిలి సంతసించి, వారి నాశీర్వదించెను. కులపతియగు కౌశికుని యాజ్ఞగా రాజపుత్రిని మధ్యాందినసవనవేళ యతిక్రమింపకుండ రాజమందిరమునకుఁ బోవలసినదని చెప్పెను. మలయవతియు సోత్కంఠముగా నిశ్వసించుచు సానురాగమున నాయకునిఁ దిరిగి చూచుచుఁ దాపసితో నిష్క్రమించెను. నిష్క్రమించుచున్న మలయవతీ సౌందర్యాకృష్టమానసుండై నిజశిబిరమునకుఁ బోయి యామె రూపరేఖాలావణ్యాదులనే స్మరించుకొని ధ్యానించుచుండెను.

మలయవతియు జీమూతవాహనుని జూచిన నాటినుండియుఁ దద్విషయకమగు నుత్కంఠతో మిగుల నస్వస్థముగా నుండ నెచ్చెలు లామెను వెంటనే యుద్యానవనమునఁ గల యొక చందన

లతాగృహంబునకుఁ జేర్చిరి. అచట మలయవతి యొక చంద్ర కాంతశిలాతలంబున నాసీనయై సేదఁ దీర్చుకొనుటకై ప్రయత్నించు చుండెను. చెలికత్తె లామె శరీరతాపమునకుఁ దగిన శీతలోప చారములఁ గావించుచుండిరి. పలకాకచే మిగులఁ బొగులుచుండిన జీమూతవాహనుఁ డామె చందనలతామండపమున నుండునేమో యని భావించి విదూషకునితో నచ్చటికి వచ్చి, తనపై హృదయ మును లగ్నమొనర్చి పలకాక నలుగుడువడుచుఁ జెలులచే నుపచ రింపఁ బడుచున్న మలయవతిం జూచి పరమానందభరితుఁడయ్యెను.

అంతకుఁ బూర్వమే సిద్ధరాజు యునరాజగు మిత్రావసువుతో భవిష్యద్విద్యాధర చక్రవర్తి యగు కుమార జీమూతవాహనునకు మలయవతి నిచ్చి వివాహము చేయవలయునని చెప్పియుండెను. మిత్రావసువు మలయగిరి పరిసరములఁ గాఁపురమున్న జీమూత వాహనుని తలిదండ్రులకుఁ దన చెలియలి వివాహవిషయంబు నెఱింగించి వారి యనుమతి వడసి కన్యాదానమును నిర్ధరించుకొనెను. ఒక శుభముహూర్తమున మలయవతీ జీమూతవాహనుల వివా హము వైభవోపేతముగా జరిగిపోయెను. ఆ ప్రణయమూర్తు లన్యోన్యానురూపయౌవనవిలాసములతోఁ గాలముఁ బుచ్చుచుండిరి.

ఇట్లుండ వివాహానంతరము పది దివసముల లోపలనే యొక నాఁడు జీమూతవాహనుఁడు మలయపర్వతమునకుఁ దగులుచున్న సముద్రవేలను జూడఁబోయెను. ఆ మహాపురుషునితో మిత్రావసువు కూడ పయనమై పోయియుండెను. ఉభయులు నా మలయగిరి పరిసరములఁ దిరుగాడుచు నచ్చటఁ గల ప్రకృతి దృశ్యముల కచ్చెరువందుచు విచ్చలవిడిగా విహరించుచుండిరి. అట్లా ప్రదేశ ములను నేత్రపర్వముగాఁ దిలకించుచు నొక్కచో జీమూత వాహనుఁడు తెల్లని శరన్మేఘములచే నాక్రమింపఁబడిన మంచుఁ గొండ శిఖరములా యననొప్పు మలయాచలసానువులఁ దిలకించి

వాని సౌందర్యమును మిత్రావసువుతో నభివర్ణించి చెప్పెను. అందులకు మిత్రావసువు జీమూతవాహను నుద్దేశించి, "కుమారా, నీవు చూచినవి మలయాచల సానువులు కావు. అవి నాగుల యస్థిపంజరముల ప్రోవు"లని వక్కాణించెను.

దయావీరుఁడైన జీమూతవాహనుఁడా ప్రసక్తిని విన్నంత మాత్రముననే బిట్టువగచి మిత్రావసువుతో "నీ నాగులకు సంఘాత మృత్యువెందులకుఁ దటస్థించిన" దని ప్రశ్నించెను. అందులకు మిత్రావసువు "నాగులకు సంఘమరణము రాలేదనియు, వైనతేయుఁడు తన ఱెక్కల గాలిచే సమస్తాంబునిధి జలములను విరఁజిమ్మి, రసాతలంబున కేఁగుచు, నాగులను గాలించి, యనుదినము సంహరింప సాగెననియు, నంతట సమస్త నాగలోక వినాశమును శంకించి, నాగరాజు వైనతేయునకు దినమున కొక్కొక్క నాగుని యాహారముగా సముద్ర తటమునకుఁ బంపుచుండునని, గరుత్మంతునితో నొక నియమమును జేసికొనెననియు, నది కారణముగా గరుత్మంతుఁడు ప్రతిదినము నొక్కొక్క భుజంగమునే చంపి తినుచున్నందున, నయ్యురగ సంతతుల యెమ్ములీ తీరునఁ గిరులవలెఁ బెరిగిన" వనియుఁ జెప్పెను.

అట్లా యెమ్ములప్రోవుల విషయమును దెలిసికొని దయామయుఁడైన జీమూతవాహనుఁడు నాగులకైన దుస్థితికిఁ బిట్టు వగచెను. నిజశరీరము నొసంగి యొక్క పన్నగమునైన రక్షింపలేక పోయితినే యని మిక్కిలి వాపోయెను. ఇంతలో సునందుఁడను ప్రతీహారి యొకఁడు ప్రవేశించి జామాతృసమీపముననున్న మిత్రావసువుతో "తండ్రిగారు మీరాకకై యెదురుచూచుచున్నారనియు, వెంటనే మీరు బయలుదేరవలసియుండు" ననియుఁ జెప్పెను. వెంటనే మిత్రావసువు ప్రతీహారితో నిష్క్రమించెను.

జీమూతవాహనుఁడు గరుడుఁ డొనర్చు పాపకార్యమున కేవగించుకొనుచు, సముద్రతీరము నవలోకించుచు, నచ్చటఁ దిరుగాడుచుండెను. ఇంతలో గరుడునకును శేషునకును జరిగిన నిబంధన ప్రకార, మా దినమునకు వంతుగా వచ్చిన శంఖచూడుఁడను నాగకుమారుఁడచ్చటికి గొనిరాఁబడెను. తన కుమారునకు సంప్రాప్తింపఁబోవు దుర్మరణమునకై మిక్కిలి పరిదేవన మొనర్చుచు వచ్చుచున్న వృద్ధ నాగమాతచే ననుగమ్యమానుఁడైన శంఖచూడుని జీమూతవాహనుఁడు చూచెను. రక్తవస్త్రి యుగళమును జేతఁబట్టుకొని యొక కింకరుఁడా నాగకుమారుని వెన్నంటి వచ్చుచుండెను. పెద్దపెట్టున నేడ్చుచున్న వృద్ధమాత రోదనము మిన్నుముట్టుచుండెను. ఇట్టి కరుణారసపూరితమైన దృశ్యము జీమూతవాహనుని గుండియ లవియఁజేసెను. శంఖచూడుఁడు వధ్యశిల యొద్దకుఁ గొనిరాఁబడెను. తల్లి దుఃఖమునకు మేర లేకపోయెను. జీమూతవాహనుఁడు సర్వము నొక చెట్టు మాటుననుండి వినుచుండెను. ఇంతలోఁ గింకరుఁడు రక్తాంశుకయుగళము నిచ్చి శంఖచూడుని వధ్యశిలపైఁ గూర్చుండుమని, వాసుకి యాజ్ఞను వినుపించెను.

వృక్షమును మాటుగాఁ జేసికొని, సర్వమును వినుచున్న జీమూతవాహనుఁడు, శంఖచూడుఁడు వాసుకిచేతఁ బరిత్యక్తుఁడై వైనతేయుని నోటఁ బడఁబోవనున్నాఁడని విని, గరుత్మంతుని దుష్కరచర్యల కేవగించుకొనుచు, నచ్చోటికి వచ్చి, కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్న వృద్ధ నాగమాతను "తల్లీ దుఃఖపరాధీనవు కాఁబోకుము. వైనతేయునకు నాశరీరము నిచ్చి నీపుత్త్రుని రక్షించెద" నని యూరడించెను. ఆత్మార్పణ నిశ్చయ మానసుండైన జీమూతవాహనుని బల్కులు విపద్దశ యందుఁ గ్రుంగి, కుమిలిపోవుచున్న నాగమాతకును, శంఖచూడునకును నమృతప్రాయము లయ్యెను గాని, వారందుల కంగీకరింపరైరి. ఎట్టులో జీమూతవాహనుఁడా

శంఖచూడు నొప్పించుటకై ప్రయత్నించెనుగాని విఫలమనోరథుం డయ్యెను. గరుత్మంతుఁడు వచ్చులోపల, శంఖచూడుఁడు దక్షిణ గోకర్ణునికిఁ బ్రదక్షిణమొనర్చివచ్చి, ప్రభునానతి నెరవేర్చెదనుగాక యని, నిర్ధరించుకొని, తల్లి వెంటరాగా, నచటి కనతిదూరమున నున్న యాలయమునకుఁ బోయిరి.

ఇంతలోఁ గంచుకి వచ్చి వైవాహికాచారము చొప్పున జీమూతవాహనునకు రక్తాంబరములఁ దెచ్చియిచ్చెను.అతఁడా వస్త్రములనె వధ్యచిహ్నములుగా ధరించి, యిది చక్కని యవకాశమని తెలిసికొని, శంఖచూడుఁడు వచ్చులోపల నా వధ్యశిలపైయాసీనుఁడై యుండెను. అంతలోపల వైనతేయుఁ డచ్చటికి వచ్చి, నిజవజ్రదంష్ట్ర చంచువుచేఁ బట్టుకొని మలయశిఖరముపై కెగిరిపోయి యచ్చట భక్షింపసాగెను. ఆ సమయమున దేవదుందుభులు మ్రోఁగెను. దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. ఇంతలో గోకర్ణుని దర్శించి వచ్చి శంఖచూడుఁడు వధ్యశిలను సమీపించెను. అచటఁ గల రక్తచిహ్నములఁ బట్టి, ఖగపతి జీమూతవాహను నెత్తుకొనిపోయెనని భావించి, మిక్కిలి దుఃఖించుచు, నేనును నా పరమకారుణికోత్తమునే యనుసరింతునని గరుడుని జాడనుబట్టి పోయెను.

ఖగేశ్వరుఁడు జీమూతవాహనుని భక్షింపుచు, నించుకంతయు వ్యథచెందని యతనిని గూర్చి యీ మహానుభావుఁ డెవ్వఁడై యుండునా యని సంశయించుచుండెను. వెంటనే జీమూతవాహనుఁడీ సుపర్ణుఁడు సంశయించుచున్నాఁడని భావించి "మహాత్మా, నా శరీరమునందు రక్తమాంసము లింకను గలవు. నీవు సంకోచింపక భక్షింపవలసిన" దని ప్రార్థించెను. ఖగపతి యా పుడమిపతి బాధనొందక సంతుష్టాంతరంగుఁడై యట్లు పలుకుచున్నందులకు మిక్కిలి యాశ్చర్యచకితుఁడై భక్షించుటను మానివేసెను. ఇంతలో శంఖచూడుఁ డచ్చటికిఁ బరుగెత్తుకొని వచ్చి గరుడుని బురస్కరించుకొని

"మహాత్మా, సాహసము వలదు. నీవు భక్షించువాఁడు నాగుఁడు కాడు. అతఁడు పరార్థసంపాదనామృతరసాస్వాదాక్షిప్తహృదయుఁ డగు విద్యాధరుఁడు. ఇదిగో నన్ను భక్షింపుము. నేనే వాసుకిచే నీ కాహారముగా నియోగింపఁబడినవాఁడ" నని గరుత్మంతుని సమీపించెను. ఖగపతియు నిద్దఱను బోల్చి చూచుకొని, నిజమును దెలిసికొని, తన యవివేకమును గూర్చి నిందించుకొనుచు "అయ్యో, నేనీ మహాత్మునికి బాధను గూర్చి యపయశఃపంకమున మునిగితిని గదా" యని మిక్కిలి వాపోవఁదొడఁగెను.

గరుత్మంతుఁడు జీమూతవాహనుని మలయశిఖరమునకుఁ దీసికొని పోవుచుండఁగా మధ్యేమార్గమున నాతని చూడామణి యూడి యాశ్రమమునఁ గాఁపురమున్న జీమూతకేతువు పాదములపైఁ బడెను. రుధిరార్ద్రమాంసకేశములతోఁ గూడిన యా చూడామణి తమ పుత్రునిదై యుండనోపునని యా వృద్ధదంపతులు మిక్కిలి వాపోవఁదొడఁగిరి. అంత శంఖచూడుఁడు పరుగున వచ్చి యా చూడామణి జీమూతవాహనునిదే యని నిక్కము వక్కాణించెను. వృద్ధదంపతులు, మలయవతియు మిక్కిలి వైక్లబ్యముతోఁ బరిదేవనము గావించుచు మలయపర్వతగిరిసానువులను వెదకుచు వచ్చి, గరుడుని ముందఱఁ బ్రాణావశిష్టుఁడై పడియున్న జీమూతవాహనుని జూచి మిక్కిలి రోదనము చేయసాగిరి. మలయవతి మూర్ఛపోయెను.

ఇదంతయుఁ జూచుచున్న గరుడుఁడు తన యసమీక్ష్యకారిత్వముచే నింత ఘటించినదని, తన్నుఁదాను నిందించుకొనుచు, మూర్ఛపోయినవారికిఁ దన ఱెక్కలతో విసరుచు జీమూతవాహనునికి శిరస్సున నంజలి ఘటించి మ్రొక్కరించి "మహాత్మా, నరకజ్వాలలు ముట్టినట్లు దుఃఖ మనుభవించుచున్న నా పాపమునకు నివారణోపాయము నుగ్గడింపుమని ప్రార్థించెను. ప్రాణావశిష్టుఁడై నేలఁ

బడియున్న జీమూతవాహనుఁడా సుపర్ణునికి "మహాత్మా, "అహింసా పరమోధర్మ" అను నార్యోక్తిని బాటించి నేటినుండియుఁ బ్రాణిహింస మానుకొను" మని ప్రబోధించెను. అజ్ఞానాంధకారమున మునిఁగియున్న ఖగనాథుఁడా నాఁటినుండియుఁ బ్రాణివధమును మానుకొందునని దృఢనిశ్చయుఁ డయ్యెను.

అంతలో జీమూతవాహనుని యవయవములలో వేదన యధికమై మరణచిహ్నములు కానుపించెను. ఆ మహాపురుషుఁ డంత్యక్షణమునందు సగము తెఱచిన కన్నులతోఁ దలిదండ్రులను జూచి వారికిఁ గడపటి నమస్కారమును జేసి యసువులఁ బాసెను. గరుత్మంతుఁడు మిక్కిలి పశ్చాత్తప్తుఁడై జీమూతవాహనుని, శల్యావశేషములుగా నున్న పన్నగములను బ్రదికించుటకై యమృతవర్షము గురియింప స్వర్గమున కేఁగెను. అంతలోపల మలయవతి మూర్ఛనుండి తేఱుకొని "గౌరీ, విద్యాధరచక్రవర్తి నీకు భర్త యగు" నని దీవించి వరమిచ్చితివి కదా! మందభాగ్యురాలను నాయెడ నీవిచ్చిన వరమును వమ్మయ్యెను గదా!" యని గౌరిని గూర్చి మిక్కిలి వాపోవుచుఁ బ్రార్థించెను.

అంతట గౌరి ప్రత్యక్షమై, మలయవతి నోదార్చి, జీమూతవాహనుని బ్రదికించెను. భగవతి గౌరియే జీమూతవాహనుని విద్యాధర చక్రవర్తిగాఁ బట్టాభిషేకము చేసెను. ఆ భగవతి యొక కాంచనచక్రమును, నాలుగుదంతముల వెల్లయేనుఁగును, మలయవతి యను స్త్రీరత్నమును నా మహాత్మునకుఁ బ్రసాదించెను. మతంగదేవప్రభృతులగు విద్యాధరపతులు భక్తితాత్పర్యములతో శిరములువంచి యాజేనికి నమస్కరించిరి. అయ్యవసరంబున గరుత్మంతుఁడు స్వర్గలోకమునుండి యమృతవర్షమును గురియించెను. అది కారణంబుగాఁ జిరకాల శల్యావశేషములైన యాశీవిషములన్నియుఁ బునర్జీవములు గలవై జీమూతవాహనుని కీర్తిప్రతిష్ఠల వేనోళ్లఁ గొనియాడుచుఁ బాతాళంబున కేఁగెను.

# నాటకలక్షణములు

## కావ్యము



సూర్యచంద్రులు, ఋతువులు, పర్వతములు, శృంగారాది రసములు, సరస్సు, వనము, ప్రాతఃకాల మధ్యాహ్నసాయాహ్నములు, పురము, సముద్రము, యుద్ధము, ప్రయాణము, నీతి, జూదము, వివాహము, పుత్రోత్పత్తి మొదలుగాఁ గల యష్టాదశవర్ణనలు గలది కావ్య (ప్రబంధ) మనఁబడును. వేదము శబ్దప్రధాన మై ప్రభుసమ్మిత మైనది. పురాణ మర్థప్రధాన మై సుహృత్సమ్మిత మైనది. కావ్యము భావప్రధాన మై కాంతాసమ్మిత మైనది. ప్రభువువలె శాసింపక, మిత్రునివలె నూరక సలహా నిచ్చి యూరకుండక, కాంతవలె సుకుమారముగా మనస్సును గరఁగించి మానవుఁడు తనకుఁ దానే కర్తవ్యమునకుఁ గడంగునట్లు ప్రేరేపించునది కావ్యము. కావునఁ గావ్యపక్కి యుత్తమ మైన దని పెద్దలు వాకొందురు. ఈ కావ్యములు రెండు విధములుగాఁ బరిగణింపఁబడి యున్నవి. 1. శ్రవ్యకావ్యములు. 2. దృశ్య కావ్యములు.

శ్రవ్యకావ్యములు :— శ్రవ్యకావ్యము లనఁగా విని యానందింపఁ దగినవి. అవి పద మయము లనియు గద్యమయము లనియు రెండు విధములు. పద్య పయములుగా నుండునవి మహా కావ్యము లనియు, ఖండ కావ్య లనియు విభజింపవచ్చును. గద్య మున నాఖ్యాయిక, కథ మొ ఖగాఁ గల విభాగములు గలవు. గద్య పద్యాత్మక మైన కావ్యమ ప జంపు వందురు. వీనియందలి

2

విషయములను బాత్రల ముఖమునం గవి చెప్పించుటయే కాక తాను గూడ నచ్చటచ్చటం జెప్పుచుండును. వీనియందుండు భాగములకు నాశ్వాసము లనియు సర్గము లనియుం బేరిడుచుందురు. వసుచరిత్రాదిప్రబంధము లీ శ్రేణికిం జెందినవి.

దృశ్యకావ్యములు:— దృశ్యకావ్యములు వినుటకు మాత్రమే కాక చూచుటకును యోగ్యము లైనవి. ఇవి రంగస్థలములయందు నటు లభినయాదులచేం బ్రదర్శింపంగాం జూచి యానందింపం దగినవి. వీనినే రూపకము లందురు. ఆంగిక, వాచక, ఆహార్య, సాత్త్వికము లనెడు చతుర్విధాభినయముల మూలమున రంగస్థలములం బ్రదర్శించు నపుడు కథావస్తువునందలి పాత్రల రూపములు నటులయం దారోపితము లగుటచే నాటకాదులకు రూపకము లను నామము కలిగినది. అభిజ్ఞానశాకుంతలము, నాగానందము మొదలుగాంగల రూపకము లీ శ్రేణికిం జెందినవి.

## రూపక విభేదములు

ఋగ్వేదకాలమునాండే సంస్కృతనాటకపరిణామమునకు మూలము లనందగిన వాసోవాక్యములు (ఇంద్ర మరుత్సంవాదము, ఊర్వశీ పురూరవము మొదలుగాం గల సంవాదములు పుట్టినవి.) కాలక్రమమున వివిధరూపకభేదము లవతరించినవి. రసవస్తునాయకాదులనుబట్టి శాస్త్రజ్ఞులీరూపకములను దశవిధములుగా విభజించిరి.

దశరూపకములు:— 1. నాటకము, 2. ప్రకరణము, 3. భాణము, 4. వ్యాయోగము, 5. సమవాకారము, 6. డిమము, 7. ఈహామృగము, 8. అంకము, 9. వీథి, 10. ప్రహసనము, మఱియు నాటిక, త్రోటకము మొదలుగాం గల పదునెనిమిది యుపరూపకములు కూడం గలవు.

## నాటకము

నాటకమునఁ బురాణప్రసిద్ధమగు కథయు, నయిదు మొదలు పదినాలుగు నంకములు నుండవలయు నను నియమము గలదు. దీనియందుఁ బ్రఖ్యాతవంశోద్భవుఁడైన ధీరోదాత్తగుణములు గలిగిన ప్రతాపవంతుఁడు నాయకుఁడుగా నుండవలయును. శృంగార వీరములలో సముచితమగు రసము ప్రధానముగను, నితర రసము లంగములుగను నుండవలయును. ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శము, నిర్వహణము నను పంచ సంధు లుండి ప్రధానఫలము నాయకునకుఁ జెందుచుండవలయును. నిర్వహణ సంధియం దద్భుతరసమును బ్రతిపాదింపవలయును. అంకములు గోపుచ్ఛన్యాయమున నుండవలయును. (క్రమముగా నంకములు చిన్నవి కావలయు నని కొంద అందురు.)

ఇట్టి విశిష్టములైన లక్షణములతోఁ గూడిన నాటకము దృశ్య కావ్యములలో నుత్తమోత్తమ మైనది. నాట్యవేద మఖిలనిగమార్థ సారము. నృత్యగీతవాద్యములు శిశువులను, బశువులను నానందింపఁ జేయుచుండఁగా సరసములగు సంగీత సాహిత్యములు పండితపామరులకును రమ్యము లగుటకు సందియము లేదు. "నాటకాంతం హి సాహిత్యమ్" కావున కావ్యములలో నాటకము మిక్కిలి రమ్యమైన దని చెప్పఁదగును.

## నాయక భేదములు

రూపకములందలి ప్రధానఫల మెప్పుడును నాయకునకుఁ జెందుచుండవలయును. నాయకుఁడు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంత భేదంబుల నాల్గు తెఱంగులవారై యుందురు. నాయకుని గుణములను గూర్చి లక్షణశాస్త్రములు పలుతెఱంగుల నుగ్గడించు

చున్నవి. రూపము, యౌవనము, ఔజ్జ్వల్యము, ఔదార్యము, ఉత్సాహము, కులీనత, ధార్మికత్వము, వైదగ్ధ్యము, భాగ్యము, విలాసము, గాంభీర్యము, తేజస్విత మొదలుగాఁ గల యుత్తమ లక్షణములు నాయకున కుండవలయును. శృంగారనాయికా విభేదముల ననుసరించి నాయకుని అనుకూలుఁడు, దక్షిణుఁడు, శఠుఁడు, ధృష్టుఁడు నని లాక్షణికులు విభజించిరి.

(1) ధీరోదాత్తుఁడు:— ఆత్మశ్లాఘాపరాఙ్ముఖుఁడు, క్షమావంతుఁడు, అతిగంభీరుఁడు, మహాసత్త్వుఁడు, స్థేయుఁడు, నిగూఢాభిమానుఁడు, దృఢవ్రతుఁడు ధీరోదాత్త నాయకుఁడుగాఁ బరిగణింపఁబడును.

(2) ధీరోద్ధతుఁడు:- అహంకారము, అసహనము, కపటము, ఆత్మశ్లాఘాపరాయణత, చపలత కలవాఁడు ధీరోద్ధతుఁడుగాఁ బరిగణింపఁబడును.

(3) ధీరలలితుఁడు:— నిశ్చింతుఁడు, కళాసక్తుఁడు, భోగలాలసుఁడు, సుకుమారుఁడు ధీరలలితుఁడుగాఁ బరిగణింపఁబడును.

(4) ధీరశాంతుఁడు:— సత్యము, దానము, కరుణ మొదలగు గుణములు కలవాఁడు ధీరశాంతుఁడు.

## నాయిక భేదములు

నాటకములం దాయా నాయకుల కనుగుణమైన నాయికలను చిత్రించుట లాక్షణిక సంప్రదాయము. అలంకారశాస్త్రజ్ఞులు నాయికను స్వీయ, పరకీయ, సామాన్య యని ముత్తెఱఁగుల విభజించి లక్షణముల నిర్వచించిరి. మఱికొందఱు ధీర, లలిత, ఉదాత్త, నిభృత యని చతుర్విధనాయిక లని చెప్పి లక్షణముల నిర్వచించి యున్నారు. ఆలంకారికులు కొందఱు స్వీయను ముగ్ధ,

మధ్య, ప్రగల్భ యనియు ముత్తెఱఁగుల నిర్వచించిరి. నాయికయు నాయక సామాన్యగుణములు కలదిగా నుండును.

1. స్వీయ:- లజ్జాశీలాదిగుణసంపన్న యగు పతివ్రత స్వీయ.

2. పరకీయ:- పరునిభార్య యైనను, పరుల యధీనమందున్న కన్య యైనను నాయిక యైనచోఁ బరకీయ యనఁబడును.

3. సామాన్య:- కళానిపుణయు, ధీరయు నగు వేశ్య సామాన్యనాయికగాఁ బరిగణింపఁబడును.

A. ముగ్ధ:- క్రొత్తగా నంకురించుచున్న యౌవనము కలదియు, రతియందుఁ బ్రతికూలయు, విశేషముగా లజ్జించునదియు, ముగ్ధ నాయిక యనఁబడును.

B. మధ్య:- లజ్జయుఁ గామోద్రేకము సమముగాఁ గల యువతి మధ్యనాయిక యనఁబడును.

C. ప్రగల్భ (ప్రౌఢ):- కామోద్రేకముచే సిగ్గువిడిచిన యువతి ప్రౌఢనాయికగాఁ బరిగణింపఁబడును.

శృంగార నాయికలు:— లాక్షణికులు శృంగారనాయికల నెనిమిది తెఱఁగులుగా విభజించిరి.

1. స్వాధీనపతిక:- కాంతుఁడు తనకు వశుఁడై తనచెంతనే యుండవలయు నని యభిలషించునది.

2. ఖండిత:- ప్రియుఁడు పరకాంతనుబొంది రాఁగా మాత్సర్యమును వహించునది.

3. అభిసారిక:- కామపీడితయై కాంతుని జేరఁబోవు నట్టిది.

4. విప్రలబ్ధ:- సంకేతము ప్రకారము ప్రియుఁడు రానియెడల మనోవైక్లబ్యమును బొందునట్టిది.

5. కలహాంతరిత:- కోపముతో భర్తను దూషించిపోయి పిదప పశ్చాత్తాపపడునది.

6. ప్రోషితభర్తృక:- కార్యాంతరనిమగ్నుఁడై కాంతుఁడు దేశాంతరమునకుఁ బోఁగాఁ గామార్త యగునట్టిది.

7. వాసకసజ్జిక:- బాగుగా నలంకరించుకొని శయనమందిరమున నుండి ప్రియునికొఱ కెదురుచూచునట్టిది.

8. విరహోత్కంఠిత:- వచ్చుట కుద్యుక్తుఁ డయ్యును దైవవశమునఁ బ్రియుఁడు రాఁడేని, యట్టి యాలస్యమునకు సహింపక వగచునట్టిది.

## రసము

రసనిర్వచనము:— రస మనగా నానందము. కావ్యపరిశీలనము చే నలౌకికము, ననిర్వచనీయము, నఖండము నగు నానందము సహృదయులకుఁ గలుగును. "విభావానుభావసాత్త్వికవ్యభిచారీ సంయోగాద్రసనిష్పత్తిః" (భరతముని నాట్యశాస్త్రము) విభావ, అనుభావ, సాత్త్విక వ్యభిచారీభావముల స్థాయీభావము పరిపుష్టమై, బ్రహ్మానందసహోదర మగు నానందమును గల్గించునపు డది రసమని నిర్వచింపఁబడును. కావ్యప్రయోజనములలోఁ బ్రధానమైనది రసానందానుభవము. మానవుని హృదయమునం దన్నిరసములును నన్నిభావములును నుండును. కావ్య మాయా భావములను రసత్వమును జెందించును. రస మనునది కావ్యములలో వర్ణింపఁబడెడి నాయికానాయకుల యవస్థల ననుకరించునటులయుం దుండినట్లు కన్పించునే కాని యది సత్యము కాఁజాలదు. నిజముగాఁ బరిశీలించినచో నాయా యవస్థలఁ జూచి సంతోషమును బొందుచున్న ప్రేక్షకులయందు మాత్రమే రస ముత్పన్నమగుచుండును. అది కారణముగా సామాజి

కులు రసికులని వ్యవహరింపఁబడిరి. దీనిని బట్టి కావ్యార్థపరిజ్ఞానమున నుప్పొంగునట్టి యాత్మానుభవమే రసాస్వాదనము. సౌందర్య సంబంధియు నానందానుభవము గలట్టియు రసమును నవవిధములుగా లాక్షిణికులు విభజించిరి. 1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. వీరము, 5. భయానకము, 6. బీభత్సము, 7. రౌద్రము, 8. అద్భుతము, 9. శాంతము.

స్థాయీభావము:— ఇతర ప్రవాహములచే మార్పునొందక తనయందేకీభవింపఁజేసికొను సముద్రమువలె సజాతీయ విజాతీయ భావములచేఁ బానెట్టి మార్పునొందక, వానిని దనలో విలీనము చేసికొనుచుఁ బెంపొందునది స్థాయీభావము.

విభావానుభావ సంచారీభావములు:— స్థాయీభావమునకుఁ గార్యకారణ, ఆనుషంగికములైన భావములే విభావానుభావ సంచారీ భావములు. స్థాయీభావకారణము విభావము. ఇది ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము నని రెండువిధములు. రతి హాసాదిభావముల రమణీయముగా సూచించు నంగవిక్షేపముఖ వికాసాదికమే యనుభావ మగును. స్వేదరోమాంచాదులైన సత్త్వ సంజాతములగు భావములు సాత్త్వికభావములు.

వ్యభిచారీభావములు:— స్థాయీభావమునందు దానినుద్బోధించుటకై యుద్భవించి క్షణకాలముండి తమ కార్యము ముగిసిన పిమ్మట నదృశ్యము లగునవి వ్యభిచారీభావములు.

## నవరసములు

1. శృంగారరసము (రతి స్థాయీభావము) స్త్రీపురుషులకుఁ బరస్పరానురాగమునఁ గలుగు నభిలాషయే రతి. అట్టి రతి స్థాయీ భావముగాఁ గలిగినది శృంగారరసము.

2. హాస్యరసము (హాసము స్థాయీభావము) వికారచేష్టలను వికృతాకారమును జూచినప్పుడును, వికృతాలాపముల విన్నప్పుడును మానవునకు హాసము కలుగును. అట్టిహాసము స్థాయీభావముగాఁ గలిగినది హాస్యరసము.

3. కరుణరసము (శోకము స్థాయీభావము) ఇష్టజనవిరహవ్యథచేఁ గలిగిన దుఃఖ మతిశయింపఁగా నది శోకముగాఁ బరిణమించును. అట్టి శోకము స్థాయీభావముగాఁ గలిగినది కరుణరసము.

4. వీరరసము (ఉత్సాహము స్థాయీభావము) వీరులు నిత్యము గావించు లోకోత్తరకృత్యముల ప్రయత్నమే యుత్సాహమనఁబడును. అట్టి యుత్సాహము స్థాయీభావముగాఁ గలది వీరరసము.

5. భయానకరసము (భీతి స్థాయీభావము) భయంకరాకారమును జూచినను భయంకరవృత్తమును విన్నను మనస్సున భీతి కలుగును. అట్టి భీతి స్థాయీభావముగాఁ గలది భయానకరసము.

6. బీభత్సరసము (జుగుప్స స్థాయీభావము) జుగుప్సాకరములైన వస్తువులను (నెత్తురు, మాంసము మొదలుగాఁ గలవి) జూచినప్పుడు మన హృదయములో జుగుప్స యుత్పన్న మగును. అట్టి జుగుప్స స్థాయీభావముగాఁ గలది బీభత్సరసము.

7. రౌద్రరసము (రోషము స్థాయీభావము) శత్రువు లపకారమొనరింపఁగా హృదయమున రోష ముత్పన్న మగును. అట్టి రోషము స్థాయీభావముగాఁ గలది రౌద్రరసము,

8. అద్భుతరసము (ఆశ్చర్యము స్థాయీభావము) అపూర్వవిశేషములను జూచినప్పు డాశ్చర్య ముత్పన్న మగును. అట్టి యాశ్చర్యము స్థాయీభావముగాఁ గలిగియుండున దద్భుతరసము.

9. శాంతము (శమము స్థాయీభావము) శాంతోన్ముఖమైన హృదయనిశ్చలత, భోగానుభవములయం దాసక్తి లేకుండుటయే శమము. అట్టి శమము స్థాయీభావముగా నుండునది శాంతరసము.

## ఇతివృత్తము (వస్తువు)

నాటకమునందలి కథావస్తువు 'ఆధికారికము' 'ప్రాసంగికము' నని రెండువిధములుగా నుండును. ప్రధానపాత్రలతో సంబంధించి నాటకమునం దంతటను విస్తరించి యుండునది 'ఆధికారిక' మనఁబడును. నాయకేతరపాత్రలతో సంబంధించి ప్రధానకథకుఁ బోషక మైనవృత్తము 'ప్రాసంగిక' మనఁబడును. ఈ నాటకవస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నని మఱలఁ ద్రివిధభేదములతో నొప్పియుండును. లోకప్రసిద్ధమైన రామాయణాదిగ్రంథములనుండి గ్రహింపఁబడిన యితివృత్తము ప్రఖ్యాత మనఁబడును. కల్పిత కథ యుత్పాద్య మనఁబడును. పై రెండు లక్షణములు కలిసి యుండునది మిశ్ర మనఁబడును. నాటకప్రయోగవిశేషములను బట్టి యీ వస్తువే మఱల రెండువిధములుగా విభజింపఁబడినది. 1. దృశ్యము, 2. సూచ్యము. రంగస్థలమునఁ బ్రదర్శింపఁబడునది దృశ్యము. అర్థోపక్షేపకములచే సూచితమగునది సూచ్యము. (అర్థోపక్షేపకములు:— ప్రవేశకము, విష్కంభము, చూళిక, అంకాస్యము, అంకావతారము).

## పంచసంధులు

కథకు మొదట బీజమును, జివర ఫలమును నెల్లలుగాఁ దీసికొని యీ లోపలి కథ నైదుభాగములుగాఁ జేసికొనవలయు నని లాక్షణికులు నిర్వచించిరి. ఈ యయిదు భాగములకును నైదు సంధులని పేరులు వెట్టిరి. 1. ముఖసంధి, 2. ప్రతిముఖసంధి, 3. గర్భము, 4. అవమర్శము, 5. నిర్వహణము. వీనిలోఁ బర్యవ

సానమైన ఫలమునకుఁ గారణములైన యైదంశములను నర్థప్రకృతు లనిచెప్పి, కథారంభమునుండియుఁ బలసిద్ధి యెట్టి యెట్టి పరిస్థితులతో సూచిత మగుచున్నదో, యీ పరిస్థితుల నర్థావస్థలని చెప్పిరి. ఒక్కొక్క యర్థప్రకృతి యొక్కొక్క యర్థావస్థతోఁ గలిసినప్పు డొక్కొక్క సంధి యగును. అవాంతరప్రయోజనములను జూపించుచు నైదుసంధులను నాటకమునఁ బూర్తిగావించినచో నుపక్రమోపసంహారములు సూత్రింపట్టినట్లుండి, శ్రోతలకు విశ్రాంతి గలుగుచు నాకాంక్ష పూర్తియగుచుఁ బైకథపైఁ గుతూహలము గలుగు నని లాక్షణికుల యాశయము. మఱియు నాటకకథ నైదు భాగములుగా విభజింపఁబడిన దాని నేఁబది చిఱుతున్కలుగా నతికి వానికి సంధ్యంగము లని పేరు పెట్టిరి. అట్టి సంధ్యంగములను బూర్తి గావించినచో నాటకమునకుఁ గావలసిన యంశములను గూర్చుకొనుటయు, గోప్యములగు విషయములను బ్రచ్ఛన్నములు సేయుటయుఁ, బ్రకటన సేయఁదగు విషయములను బ్రకాశింపఁ జేయుటయు, రక్తియు, యుక్తియుఁ, జమత్కారము, కథయు స్వయముగా నెలకొనఁగల వనియు లాక్షణికుల యభిమతము.

1. ముఖసంధి:—బీజసముత్పత్తి నానారససంభవమగుటయే ముఖసంధి.

2. ప్రతిముఖము:— బిందుయత్నమువలన దృశ్యాదృశ్యమైన బీజప్రకాశము ప్రతిముఖసంధి.

3. గర్భసంధి:—పతాకాప్రాప్త్యాశలవలన బీజాంకురమునకు లాభవిచ్ఛేదములు గలిగించునది గర్భసంధి.

4. అవమర్శము (విమర్శసంధి):— ప్రకరీనియతాప్తులవలన నేర్పడి, క్రోధముననో, వ్యసనముననో, విలోభనముననో ఫలప్రాప్తికి విఘ్నము గలిగించునది అవమర్శసంధి.

5. నిర్వహణము:—అందందు బీజమును, ముఖాదులగు నితివృత్త భాగములును దమతమ తావుల నెలకొల్పఁబడినట్టివి, యేక ప్రయోజనమును బొందినచో నద్దానిని నిర్వహణ సంధి యందురు.

## నాంది

ఎట్టి యాటంకములుం గలుగక నాటకప్రదర్శనము జరిగి పోవుటకై నటకులు రూపకారంభములందుం జేయు కార్యకలాపము పూర్వరంగ మనంబడును. అనేకాంగములు గల పూర్వరంగములో నాంది ముఖ్యమైనది. దశవిధరూపకంబుల మొదట నుండు నాశీర్నమస్క్రియాదిరూపంబగు మంగళాచరణము నాంది యనంబడును. ఇం దెనిమిది గాని, పండ్రెండు గాని, పదునెనిమిది గాని, యిరువది రెండు గాని పదము లుండవలయు నని నియమము గలదు. కాని యిట్టి నియమము గీర్వాణనాటకములయందే పెక్కుచోట్లం బాటింపం బడలేదు. అర్థముచేం గాని, శబ్దముచేం గాని కావ్యార్థసూచన చేయ వలయు ననెడి నియమము కూడం గలదు.

## ప్రస్తావన

నాందీరూపమగు పూర్వరంగ మొనరించి నాందీప్రవర్తకుం డగు సూత్రధారుండు వెడలినపిదప, నాకారగుణంబుల నాతనిం బోలిన మఱియొక సూత్రధారుండు రంగస్థలమునందుం బ్రవేశించి, నటితోం గాని, మారిషునితోం గాని, విదూషకునితోం గాని ప్రస్తుత కథాసూచకముగాం జిత్రమైన సంభాషణములను జరుపును. అట్టి సంభాషణమునకుం బ్రస్తావన యనియు, నాముఖ మనియు, స్థాపన యనియు నామములు గలవు. సామాన్యముగాం బ్రస్తావనలో సూత్రధారాదులు చక్కని పద్దెములతో సామాజికులను మిక్కిలి రంజింపంజేయుటకు నేదైన నొక ఋతువును గూర్చియుం గవి నామాదులను గూర్చియుం, గమ్మని కంఠముతో భారతీవృత్తి నాశ్రయించి కావ్యార్థమును సూచింతురు. (దీనికిం బ్రరోచన యని పేరు) ప్రస్తావనయందలి సంభాషణమున పరిషదారాధనము, ప్రధానకథాసంవిధాననిరూపణము, కావ్యకర్తృవిశేషములు ముఖ్యాంశములుగ నుండును.

## ప్రస్తావనాంగములు

కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవర్తకము, ఉద్ఘాత్యకము, అవలగితము.

1. కథోద్ఘాతము:—సూత్రధారుఁడు కథానుగుణముగాఁ బ్రయోగించిన వాక్యమును గాని, దాని యర్థమును గాని కొని పాత్రము ప్రవేశించునేని యది కథోద్ఘాత మనఁబడును.

2. ప్రయోగాతిశయము:–ఒక ప్రయోగమునందు వేఱొక ప్రయోగమును దలకొల్పినచో నది (ప్రస్తావనలో వర్ణితమైన ఋతుకాల సామ్యముచే సూచితమైనది). ప్రయోగాతిశయ మనఁబడును.

3. ప్రవర్తకము:—జరుగుచున్న కాలము ననుసరించి సూత్రధారుఁడు వర్ణనచేసినయెడల, నా వర్ణన నాశ్రయించి పాత్రము ప్రవేశించినచో దానిని ప్రవర్తక మందురు.

4. ఉద్ఘాత్యకము:—సూత్రధారుని వాక్యములవలనఁ దన క్లిష్టమగు నర్థము ప్రకటితము గాకున్నను, తెరలోనున్న పాత్ర తన మనంబునందలి యర్థము ప్రకటిత మగుటకు నా యర్థమునకు సందర్భములగు పదములను గూర్చుకొని తన మనంబునందలి యర్థమును జేసికొని రంగమునఁ బ్రవేశించినయెడల దానిని ఉద్ఘాత్యక మందురు.

5. అవలగితము:—ఒక ప్రయోగమున సమావేశనముచేత వేఱు కార్యము సాధింపఁబడునో యది యవలగిత మనఁబడును.

## అర్థోపక్షేపకములు

1. విష్కంభకము, 2. ప్రవేశకము, 3. చూళిక, 4. అంకముఖము, 5. అంకావతారము.

1. విష్కంభకము:— జరిగినవియు జరుగనున్నట్టివియు నగు కథాంశములను సామాన్యపాత్రలలో నొకఁడుగాని, యిరువురుగాని రంగస్థలమునఁ బ్రవేశించి, రంగమునఁ జూపఁదగని యుద్ధము, వివాహము మొదలుగాఁ గల విషయముల నంకప్రారంభమునఁ బ్రకటించి, కథను సంక్షేపము సేయుటయే విష్కంభక మనఁబడును. మధ్యమపాత్రలలో నొకనిచేతఁ గాని, యిరువురచేతఁ గాని కల్పింపఁబడునది శుద్ధవిష్కంభక మగును. అదే నీచ మధ్యమ ప్రయుక్త మగునేని మిశ్రవిష్కంభక మగును.

2. ప్రవేశకము:—విష్కంభక లక్షణములను గలిగియుండి, యది నీచపాత్రలచేఁ బ్రయుక్తమైనచోఁ బ్రవేశక మగును. ప్రవేశక మెప్పుడును రెండంకముల మధ్య నుండును. అనఁగాఁ బ్రథమాంకారంభమున నుండదు.

3. చూళిక:— తెరచాటున నున్నవారు వృత్తాంతమును సూచించినచో నది చూళిక యనఁబడును.

4. అంకముఖము:— ఎచట నొక యంకమందు నాటకములోఁ గల యంకముల సూచన సర్వమును జేయఁబడునో యది యంకముఖ మనఁబడును.

5. అంకావతారము:— అంకాంతమునందుఁ బాత్రములచే సూచింపఁబడినదై, ఎందు నా యంకముతో విభాగము లేకుండ మఱియొక యంక మవతరించునో యది యంకావతార మనఁబడును.

# నాగానందము

## [కర్త, కాలము, చరిత్ర]



పాఠ్యగ్రంథమైన నాగానందనాటకమునకు సంస్కృత మూలమును రచించిన మహాకవి శ్రీహర్షుఁడు. ఇతఁడు క్రీ.శ. 590 ప్రాంతమున నుండినట్లు చరిత్ర ఘోషించుచున్నది. ఇతఁడు యశోవతీ ప్రభాకరవర్ధనుల ద్వితీయపుత్రుఁడు. ఈ కవినరేణ్యుని చరిత్రము నంతయు బాణుఁడు తన హర్షచరిత్రమున జిరస్థాయిఁ గావించి యున్నందున నిందుఁ బ్రత్యేకముగాఁ జేర్కొనవలసిన యవసర ముండదు. ఇతఁడు బ్రాహ్మణమతమునం దభిమానము గల్గియుండి, బౌద్ధమతసిద్ధాంతములను, సంప్రదాయములను ననుసరించుచుండెడి వాఁడని నాగానందనాటకమును బట్టి తెలియవచ్చు చున్నది. శ్రీహర్షుఁడు మహారాజు. ఇతఁడు రాజకీయరంగములో నెంతటి సుప్రసిద్ధుఁడో సాహిత్యరంగములో నంతటి సిద్ధహస్తుఁడు. ఇతని యాస్థానమునఁ జేరెన్నికఁ గన్న కవులు పెక్కు రుండిరి. వారిలో బాణుఁడు మయూరుఁడు మొదలుగాఁ గల కవులు జగత్ప్రసిద్ధులు. ఈ మహారాజు రచించిన నాటకములు మూఁడు. అవి రత్నావళీ ప్రియదర్శికా నాగానందములు. రత్నావళీ ప్రియదర్శికలు నాటికలు. నాగానందము నాటకము.

పై వివరింపఁబడిన నాటకత్రయమును శ్రీహర్షదేవుని యాస్థాన కవీశ్వరుఁడైన ధావకుఁ డనుపండితోత్తముఁడు వ్రాసి, తన ప్రభువైన హర్షదేవుని పేర వెలయించినట్లు కావ్యప్రకాశికయం దుదాహరింపఁబడియున్నది. ఇందలి యాథార్థ్య మెట్టిదియో గాని, కొంద ఱీ నాటకత్రయమును ధావకత్రయ మని నేఁటికిని వాడుచునే యున్నారు. మఱియు నాటకత్రయకర్తృత్వవిషయమున 'విల్సన్'

'బుల్వార్' మొదలుగాఁ గల పాశ్చాత్యవిమర్శకులు గూడ తమ యభిప్రాయభేదములను వివరించి యున్నారు. ఏది యెట్లున్నను నాగానందము శ్రీహర్ష కృత మనియే పలువురు పండితులు, విమర్శకులుఁ దమ యభిప్రాయములను వెలిపుచ్చియున్నారు.

## ఆంధ్రీకరణము

(శ్రీ) వేదము వేంకటరాయశాస్త్రి, పాలెపు వేంకటసూర్యగోపాలం, పంచాంగము వేంకటనరసింహాచార్యులు, దివాకర్ల వేంకటావధాని, పాటిబండ మాధవశర్మ ప్రభృతు లీ నాగానంద నాటకము నాంధ్రీకరించిరి. ప్రస్తుత పాఠ్యగ్రంథమగు నాగానందము నాంధ్రీకరించిన పాటిబండ మాధవశర్మ "యస్. ఆర్. ఆర్. అండ్. సి. వి. ఆర్." కళాశాల, విజయవాడలో నాంధ్రోపన్యాసకులు. వీరు బహుగ్రంథకర్తలు. వీరి యనువాదము మూలమువలె రసవంతమును, సహజమాధుర్యయుక్తము నై యలరారుచున్నది.

ప్రస్తావనయం దీ రూపకము విద్యాధరజాతకమునుండి గ్రహింపఁబడిన దని తెలియవచ్చుచున్నది. జాతకము బుద్ధుని గతజన్మములయం దాతఁ డొనర్చిన పుణ్యకార్యముల వర్ణించిన కథలప్రోవు. బోధిసత్త్వుఁడే జీమూతవాహనుఁ డై జన్మించి లోకమున స్వార్థమును విడిచి కేవలము పరార్థమునకై పాటుపడినట్లు కథాసరిత్సాగరమందును, బృహత్కథామంజరియందును నిర్వచింపఁబడియున్నది. అట్టి జీమూతవాహనుని కథనే మూలాధారముగాఁ జేసికొని శ్రీహర్షుఁడు నాగానందమును రచియించి యుండనోపును. ఈ నాటకమున నాయకుఁడైన జీమూతవాహనుని పరార్థపరాయణత్వమే ప్రధానముగా గోచరించుచున్నది. నాయకుఁడు విద్యాధరుఁడు. నాయిక సిద్ధాంగన. శంఖచూడుఁడు నాగుఁడు. గరుడుఁడు దివ్యాదివ్యుఁడు. నాటక మంతయు మానవులుగాని పాత్రలతో

నొప్పియున్నది. ఈ రూపకమునందు బుద్ధదేవుఁ డిష్టదైవముగాఁ బ్రార్థింపఁబడి యున్నవాఁడు. బౌద్ధమతప్రవర్తకుఁడైన బోధిసత్త్వుని కరుణావృత్తి పంచమాంకమున నుల్లేఖింపఁబడియున్నది. ఈ నాటకము రచింపఁబడిన కాలమున బౌద్ధమత ముచ్ఛ్రస్థితియం దుండి యుండవచ్చును. మంచి నీతిబోధకములైన నాటకములలో నాగానంద మగ్రశ్రేణికిఁ జెందిన దని చెప్పవచ్చును.

---

# పాత్రలు : గుణశీలములు

## జీమూతవాహనుఁడు (కథానాయకుఁడు)



జీమూతవాహనుఁడు విద్యాధర చక్రవర్తియైన జీమూతకేతువు యొక్క కుమారుఁడు. అతఁడు ధీరోదాత్తనాయకులలో నుత్తమోత్తముఁడు. సర్వదా పరోపకారదీక్షితుఁడు. ధర్మదయాపరుఁడు. బోధిసత్త్వుఁడు. మహాసత్త్వుఁడు. విజ్ఞుఁడు. కృతజ్ఞుఁడు. నిరంతర పితృసేవాపరాయణుఁడు. సంగీతశాస్త్రపారంగతుఁడు. సర్వత్యాగి. ఉదాత్త ప్రకృతి గలవాఁడు. ప్రేమమూర్తి. అతఁడు పరోపకారైకదీక్షాపరతంత్రుఁడై రాజ్యసుఖముల ననుభవింప నొల్లక, నిస్పృహాచిత్తుఁడుగను, దీనులపాలిటి కల్పతరువుగను బరిగణింపఁబడుచుండెను. తరుణవయస్కుఁడయ్యు గార్హస్థ్యవాంఛ లేక సదా తల్లిదండ్రుల సేవయందే నిమగ్నుఁడై, వారి సుఖమునే తనసుఖముగా భావించుచుండెడివాఁడు. రాజ్యకార్యములను మంత్రులచేతఁ బెట్టి, స్వశరీరమాదిగా సర్వముఁ బరార్థమునకే సమర్పింపవలయు ననెడి దీక్షతోఁ గాలముఁ బుచ్చుచుండెడివాఁడు.

ఆ కారుణికోత్తముఁడు చిరకాలమునుండియు వంశపారంపర్యముగాఁ దనకు సంప్రాప్తించిన కల్పతరువును సైతము పేదవారికి దానముగా నిచ్చెను. ప్రకృతి యన్నను బ్రజలన్నను నీ ప్రేమమూర్తి కున్నంత గాఢాభిమానము మఱియొక యొడయనిలో నుండదన్న నతిశయోక్తి కానేరదు. బంధువర్గమును దనయంతటివారినిగా జేయుటకుఁ బాటుపడిన సహృదయుఁడు జీమూతవాహనుఁడు.

"వ్యాపృతు లైరి భూజనులు న్యాయపథమ్మున సజ్జనాళి సు
స్థాపిత మయ్యె నాత్మసమతంగనె బంధుత యయ్యె రాజ్యముక్
ప్రాపితరక్షమిష్టఫలితాధికంబు సురద్రు వర్థికిన్
జేపడె నింతకంటెఁ గరణీయముతోఁచినఁ జెప్పుమా సఖా".

యని జీమూతవాహనుఁడు విదూషకునితో నన్నమాటలా మహానుభావుని యనుపమానదానశౌండిమమునకును, నుదాత్త ప్రకృతికిని ప్రబలతార్కాణములు. "ప్రేమమూర్తిని జగమంతయుఁ బ్రేమించు" నన్న ఆంగ్లసూక్తి యీ విద్యాధర సార్వభౌముని యందు సార్థకమైనది. సహాయార్థులై యాచకులు రాకున్నచో మిక్కిలి చింతించెడి స్వభావము గలవాఁడీ సాత్త్వికమూర్తి.

"పితృపురోభూమిఁ గూర్చుండి వెలసినట్టు
లగునె కూర్చున్నపట్ల సింహాసనమున
వచ్చునే పితృపాద సంవాహనమున
వచ్చు సౌఖ్యంబు రాజ్యసంవాహనమున"

అని యీ మితభాషియన్న సుభాషితము, మనహృదయముల సుసూక్తియై బహుకాలము నిల్చుననుటలో సందియముండదు. తన తండ్రికొఱకుఁ గాకున్నచోఁ దనరాజ్యమంతయు నితరులకిచ్చి యుండెడివాఁడఁట. తుట్టతుదకు జననీజనకుల సేవకొఱకై రాజ్యమునే త్యాగము చేసినాఁడు. వారియం దీ యొడయనికున్న భక్తిశ్రద్ధ లనుపమానములు. వివాహకాలమునఁ దలిదండ్రుల యనుమతిని బొంది వారి యాశీస్సులను బడసినాఁడు. గరుఁడునికి సలహా నిచ్చునప్పుడు కూడఁ దండ్రి యనుమతిని బొందెను. కొలఁది క్షణములలో మరణింపనుండగాఁ దలిదండ్రులకు నమస్కరించి దివి కేఁగినాఁడు. ఇత్యాదివిషయము లీ భూపాలుని సముదాచారసంపత్తికిని, ధర్మప్రియత్వమునకును నిదర్శనప్రాయము లైనవి.

జీమూతవాహనుఁడు ప్రేమమూర్తి. అతని సౌందర్య మపురూప మైనది. అందఱ డెందముల నాకర్షించునది. ఈ విషయము నాతని తల్లియు, మలయవతియుఁ జేటియు వక్కాణించిరి. తుదకు విరాగియైన తాపసుఁడు కూడ నాతని రూపవిశిష్టతను గుర్తింపఁగల్గెను.

రూపమునకుఁ దోడు సార్వభౌమాంకములు గూడఁ గల్గియుండిన మోహనాంగుఁడు. కావుననే మలయవతి తొలిచూపునందే యా పుడమిపతియందు బద్ధానురాగ యైనది. మలయవతి యా ప్రేమ మూర్తిని జేపట్టి, యతనిచేఁ బ్రణయసామ్రాజ్యము నేలింపవలయు నన్న దీక్షతో, గౌరిని గూర్చి తపస్సు చేసినది. గౌరీవరప్రసాదమున నా ముగ్ధ లబ్ధకాంక్షాముదితయై నిజహృదయాధినాథుఁ డగు జీమూత వాహనుని జేపట్టఁగల్గినది. ఇత్యాదివిషయములు జీమూతవాహ నుని రూపరేఖావిలాసాదులను వ్యక్తపఱుపఁగలవు.

జీమూతవాహనుని కులరూపవయోవిజ్ఞానముల నరసి, సిద్ధ రాజగు విశ్వావసువు మలయవతి నిచ్చి వివాహము గావించెను. ఇతఁడు సాహిత్యచతురుఁడు. లలితకళలలో దిట్ట. సంగీతశాస్త్ర పారంగతుఁడు. మలయవతి గౌర్యాలయమున వీణవాయించుచు గానము సేయుచున్నప్పుడు, నాయికయొక్క గానవిద్యానైపుణ్య మును శాస్త్రోక్తముగా విమర్శించి రసాస్వాదన మొనర్చినాఁడు.

"స్థానసంప్రాప్తిఁ దారమంద్ర వ్యవస్థ లమరఁ బ్రకటిత దశ విధగమక మగుచు.........."

"దశవిధవ్యంజన ధాతువుల్ గూడి వ్యక్తి సాధింపఁగాఁ బడె నీమెచేత ........"

ఇత్యాది విషయములలో జీమూతవాహనునకుఁ గల సంగీత విద్యాకౌశలము వ్యక్తపడు ననుటలో సందియము లేదు. మఱియు నితఁడు చిత్రలేఖనమునందు మిక్కిలి నేర్పరి. నాయికచిత్రమును గొలఁది క్షణములలోనే చలువరాతిపై రంగులతో జీవకళ యుట్టి పడునట్లు చిత్రించినాఁడు. సఖీసమేతయై మలయవతి యా చిత్ర మును స్వయముగాఁ జూచినపు డా చిత్రమునందలి నైపుణ్యమును, వాస్తవికతను మిక్కిలి శ్లాఘించినది.

జీమూతవాహనుని భూతదయ నిరుపమానమైనది. ఈ దయాపరుఁడు వివాహానంతర మొకనాఁడు మలయపర్వతమునకుఁ దగులుచున్న సముద్రవేలను జూడఁబోయి శరన్మేఘములచే నాక్రమింపఁబడిన మంచుఁగొండ శిఖరములా యననొప్పు నాగుల యస్థిపంజరముల ప్రోవులను జూచెను. గరుత్మంతుఁడు ప్రతిదినము నొక్కొక్క భుజంగమును జంపి తినుచున్నందున, నురగసంతతులయెమ్ములా తీరున గిరులవలెఁ బెరిఁగినవని తెలిసికొనెను. అట్లా యెమ్ముల ప్రోవుల వృత్తాంతమును దెలిసికొని, యీ దయామయుఁడు నాగులకైన దుస్థితికి బిట్టు వగచెను. నిజశరీరము నొసంగి యొక్క పన్నగమునైనను రక్షింపలేకపోయితినే యని మిక్కిలి వాపోయెను. ఇత్యాది విషయము లీ మహామహుని యనుకంపాతిశయస్వభావమును వెల్లడించు ననుటలో సందియ ముండదు.

జీమూతవాహనుఁడు గరుడుఁ డొనర్చు పాపకార్యముల కేవగించుకొనుచు సముద్రతీరమునఁ దిరుగాడుచుండ, గరుడునకు శేషునకు జరిగిన నిబంధనప్రకార మానాఁటివంతుగా శంఖచూడుఁడను నాగుఁడు వధ్యశిలదగ్గఱకుఁ గొనిరాఁబడెను. వృద్ధనాగమాత చేతను, రక్తవస్త్రయుగళమును జేతఁబట్టుకొని వచ్చుచున్న యొకానొక కింకరునిచేతను ననుగమ్యమానుఁడైన శంఖచూడు నా కారుణికోత్తముఁడు చూచెను. పెద్దపెట్టున నేడ్చుచున్న వృద్ధమాత పరిదేవనమును వినెను. అట్టి కరుణరసపూరితమైన దృశ్య మా దయామయుని హృదయమును ద్రవీభూత మొనర్చినది. తటాలున వధ్యశిలను సమీపించినాఁడు. కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్న కన్నతల్లిని "తల్లీ దుఃఖపరాధీనవు కాఁబోకు" మని యోదార్చినాఁడు. వైనతేయునకు నిజదేహము నిచ్చి శంఖచూడుని రక్షించెద నని యూరడించినాఁడు. విపద్దశయందుఁ గ్రుంగి కుమిలిపోవుచున్న నాగమాతకు, నాగునకు నాతని పల్కు లమృతప్రాయము లయ్యెను.

కాని వారట్లు రక్షింపఁబడుట కంగీకరింపరైరి. ఇత్యాది సన్నివేశములలో నాత్మార్పణ నిశ్చయమానసుండైన జీమూతవాహనుని యుదాత్తప్రకృతియుఁ బరోపకారపరాయణత్వమును నెంతైనను గొనియాడఁ దగియున్న వనిన నతిశయోక్తి కానేరదు.

అతని యాత్మత్యాగ మమోఘమైనది. ఇట్టి విశిష్టమైన గుణమీ నాయకునియందు సుస్పష్టముగాఁ బ్రకటితమైనది. ఆ గుణమీ నాటకమునకు వన్నెఁదెచ్చినది. నాయకుఁ డీ నాటకమునందు మూఁడు విధములైన శీలముల కునికిపట్టుగా రూపుదాల్చినాఁడు. లోకములో జీవితపరమావధి భౌతికసుఖముననే యని యంగలార్చెడు నమాయకులకును, పదవీ వ్యామోహపీడితులై ప్రాకులాడు పరమచాందసులకును, నింద్రియలోలుపత్వముతో నితరుల మేలుఁ దలంపని స్వార్థపరులకు నీ పరోపకారైకదీక్షాపరతంత్రుఁ డతీతుఁడై గుణపాఠమును నేర్పినాఁడు. వీరి ముగ్గురికేగాక ముల్లోకములకు మార్గదర్శకుఁడై ధర్మార్థ కామమోక్షములకు మూదలయై ధర్మదయావీరులకుఁ దలమానికమైనాఁడు.

అతఁడు ప్రతిగ్రహము కోరని పరార్థ ప్రాపకుఁడు. ప్రాణత్యాగము చేసియైనను నితరులకు మేలుచేయవలయుననెడి యవకాశముకొఱకై యన్వేషించుచుండెడివాఁడు. వృద్ధ నాగమాత పరిదేవనము నాలకించి, శంఖచూడునితోఁ దల్లి నింటికిఁ గొనిపోయి యూరడింపమని ప్రబోధించినాఁడు. శంఖచూడుఁడు దక్షిణ గోకర్ణనికిఁ బ్రదక్షిణమొనర్చుటకై పోయిన యవకాశమును బురస్కరించుకొని, కంచుకి యిచ్చిన రక్తాంబరముల వధ్యచిహ్నములుగా ధరియించి, వధ్యశిలపై నాసీనుడై యుండెను. అంతలోపల వైనతేయుఁడు తీవ్రవ వచ్చి నాగుఁడేయను భ్రాంతితో నా మహానుభావుని చంచువున గఱచుకొని మలయశిఖరముపై కెగిరిపోయెను. అట్లు గరుడుని చేఁ

దన్నుకొని పోవంబడు నపుడా మహాత్ముఁడమే యానందమును బొందెను. ఆత్మబలి భయంకరమయ్యును నా మహామహుఁ డేమా త్రము చలింపలేదు. సుపర్ణుఁడు చిత్రవధ చేయునపుడుకూడ ధైర్య మును సడలించినవాఁడుకాదు. గరుడుఁ డాతని ధైర్యస్థైర్యముల కాశ్చర్యచకితుఁడై తినుటను జాలించిన సందర్భమున జీమూత వాహనుఁడు.

"రక్తమిదె కాఱుచుండె సిరాముఖములఁ
గలదుసూ మాంసమింక నా గాత్రమందు
తృప్తి నీయెడఁ గాన్పింపదే మహాత్మ,
మాని తేలయ్య భుజింప నైనతేయ".

అని గరుడుని హెచ్చరించినాఁడు.

మఱియు గరుడుఁడు తనను దిన డేమోయను శంకతోఁ దన పేరును జెప్పుటకును వ్యతిరేకించినాఁడు. వధ్యశిలాస్పర్శనము మలయ వత్యాశ్లేషసుఖము కన్నను సుఖదమని భావించిన మహాత్ముఁడు జీమూతవాహనుఁడు. మలయవతి యందలి ప్రేమ, తలిదండ్రుల యెడ శ్రద్ధ, భూతదయ మొదలుగాఁగల గుణములన్నియు నతని యాత్మత్యాగమునకుఁ దరువాత లెక్కింపఁదగినవే. ఆత్మబలికి సమ యము వచ్చినప్పుడు మాతాపితలు, భార్య, బంధువులు, స్నేహితులు, యేమగుదురో యని కూడ నాలోచింపలేదు. పరార్థప్రాపణావకాశములున్నచో మోక్షమునే కాలఁదన్ని పునర్జన్మల నాహ్వానించెడివాఁడు. లోక కల్యాణకారకులైన వార లందఱికన్నను దాను మిన్నగా నుండ వలయునన్న మహదాశయమే జీమూతవాహనుని యాశయమని చెప్పవచ్చును. చావ సిద్ధమైనప్పుడుకూడ గురుభక్తిని మఱవఁడు. మాతాపితలకు నొప్పి కలుగునేమో యని తన బీభత్సాకారమును వసనాచ్ఛాదితము చేయించుకొనెను. తండ్రి యనుమతితోఁ దన

యసమీక్ష్యకారిత్వముచే నింత ఘటించిన దని పశ్చాత్తప్తుఁడై కుమిలి పోవుచున్న సుపర్ణుని పాపపరిహారమునకు సువర్ణప్రాయమైన యుపదేశమునిచ్చి, యజ్ఞాననిద్రాప్రసుప్తుఁడైన వైనతేయుని మేల్కొల్పినాఁడు.

"ప్రాణివధమ్ము మానుమిఁక ప్రాక్కృత మెంచి తపింపు
భూతసంతాన మభీతిగాంచఁగఁ దనర్చుము... ...
... ... ...నిష్ఫలంబగుర్."

మరణించియు గౌరీవరప్రసాదమునఁ బునర్జీవుఁడై యా భగవతి కరుణాకటాక్షములచే విద్యాధరచక్రవర్తిగాఁ బట్టాభిషిక్తుఁడై, కాంచనచక్రమును, వెల్లయేనుఁగును, మలయవతియను స్త్రీరత్నమును బొందెను. చిరకాలవిరోధులైన మతంగదేవ ప్రభృతులగు విద్యాధరపతు లాతనికి భక్తితాత్పర్యములతో నమస్కరించిరి. గరుడుఁడు స్వర్లోకమునుండి గురియించిన యమృతవర్షము కారణముగాఁ, జిరకాలశల్యావశేషములైన యాశీవిషము లన్నియుఁ బునర్జీవనములుగలవై, జీమూతవాహనుని గీర్తి ప్రతిష్ఠల వేనోళ్ళఁ గొనియాడుచుఁ బాతాళంబున కేఁగినవి.

అట్టి బోధిసత్త్వుఁడైన జీమూతవాహనుఁడు ముల్లోకములకు నాదర్శప్రాయుఁడై శాశ్వత కీర్తి ప్రతిష్ఠల గడించెను. ఉపమేయ భూతులైన దాతల కీర్తని నుపమానముగాఁ బ్రాచీనకవులు సైతము తమ గ్రంథములం దుదహరించుకొనిరి.

"సకలాపన్నిలయమ్మయి, యకృతజ్ఞమ్మయి వినాశియయినట్టి
శరీరకమాత్రము కొఱకేనియు, నకటా పాపములొనర్తు రతి
మూఢాత్ముల్"...............(కువలయానందమునఁ దీని
మూలశ్లోకము పరికరాలంకారమున కుదాహరణముగాఁ
జూపఁబడినది.)

"ఈగిఁ ఖేచరవల్లభుఁడనంగా .........దాన వైభవ నూతన జీమూతవాహనుండన వెలసెఁ"

కేతన దశకుమార చరిత్రము, 1 ఆ. 41-48 పద్యములు.

"శిభికర్ణ ఖేచరపీతీర్ణ ప్రౌఢి వాటింపగఁ" వసుచరిత్రము.

"మణికనకవస్తువాహనగణికాద్యఖిలప్రదాన ఖచరేంద్రునకుఁ"

నారాయణకవి పంచతంత్రము, 43 ప.

"మును శిబికర్ణ జీమూతవాహనులు పరార్థము కాదె నిజశరీరముల విడిచి" జై. భారతము, 7 ఆ. 219 ప.

ఇత్యాదులీ విద్యాధరచక్రవర్తి యౌన్నత్యమును వేనోళ్ళఁ బ్రకటించుచున్నవనిన నతిశయోక్తి కానేరదు.

## శంఖచూడుఁడు (నాగకుమారుఁడు)

శంఖచూడుఁడు గరుడుని యాహారము నిమిత్తము వాసుకిచేఁ బరిత్యక్తుఁడైన నాగకుమారుఁడు. వృద్ధురాలైన నాగమాత కతఁడేకైకపుత్రుఁడు. వైనతేయుఁడు తన ఱెక్కల గాలిచే సమస్తాంబునిధి జలములను విరఁజిమ్మి, రసాతలంబున కేగుచు, నాగులను గాలించి, యనుదినము సంహరించుచుండఁగా, సమస్త నాగలోక వినాశమును శంకించి, వాసుకి వైనతేయునితో దినమున నొక్కొక్క నాగుని యాహారముగా సముద్రతీరమునకుఁ బంపుచుందునని, నియమమును జేసికొనియెను. అది కారణముగా గరుత్మంతుఁడు ప్రతి దినము నొక్కొక్క భుజంగమునే చంపి తినుచుండెను. అట్టి నిబంధనప్రకార మొకనాఁడు శంఖచూడుఁడు వైనతేయుని యాహారము నిమిత్తము వాసుకిచేఁ బరిత్యక్తుఁడాయెను.

అతఁడు ప్రాయమునకుఁ బిన్నవాఁడైనను బ్రజ్ఞావిభవముచే మిన్నయైనవాఁడని చెప్పవచ్చును. స్వామిభక్తిపరాయణుఁడు. స్వార్థత్యాగి. సనాతనధర్మానుష్ఠాననిరతుఁడు. గొప్ప నిశ్చయ

జ్ఞానమును, శాస్త్రపాండిత్యమును గలవాఁడు. అతఁడు గరుడునికి నాహారము నిమిత్తము తాను బలి గావలసియుండఁగా స్వామి సందేశమును దలఁదాల్చి సముద్రతీరమునకు వచ్చినాఁడు. తనకు సంప్రాప్తింపఁబోవు దుర్మరణమునకై మిక్కిలి వాపోవుచు వెంట వచ్చిన తల్లిని యోదార్చుటకై

"కౌఁగిటంబూనుఁబుట్టిన గన్నవాని
ధాత్రికై నడిఁ దా ననిత్యతయె తొల్త
ఆ పయినె జనయిత్రి తా నట్టియెడల
నిందు శోకమ్మునకుఁ గ్రమ మ్మెట్టి దమ్మ"

యని పల్కిన పల్కులలో గొప్ప పరమార్థ మిమిడి యున్నది. అట్టి విశిష్టమైన పరమార్థము నెఱిఁగి, యాచరణలోఁ బెట్టిన దిట్ట శంఖచూడుఁడు.

వధ్యశిలను సమీపించి నప్పుడు, కింకరుఁడు రక్తాంశుక యుగళము జేతికిచ్చి, వాసుకి యాజ్ఞను వినుపింపఁగా, శంఖచూడుఁడు నెత్తిపైఁ జేతులు జోడించి సాదరముగా స్వామియాజ్ఞను నెర వేర్చెద నని ముందునకు వచ్చినాఁడు. తాను గరుడున కాహారముగా నాహుతి కాఁబోవుచున్నానని యే మాత్రము చలింపక రక్తాంబరములఁ గైకొనెను. కొడుకునకైన దుస్థితిని దలపోసికొనుచు, విలపించుచున్న తల్లిని యోదార్చుట యొక కార్యము, గరుడుని జఠరాగ్నిని జల్లార్చుట కాహారముగా వినియోగింపఁబడుట మఱి యొక కార్యము శంఖచూడుని శీలమునకు గీటురాళ్లైనవి. ప్రభుభక్తి ముందునకు, మాతృప్రేమ వెనకకు లాఁగఁదొడఁగినవి. తుట్టతుదకుఁ బ్రభునాజ్ఞను నిర్వహించుటయే సమంజసమని నిశ్చయించుకొని, తల్లిని మఱలిపొమ్మని చెప్పినాఁడు.

వృక్షమును మాటుగాఁజేసికొని సర్వము వినుచున్న జీమూతవాహనుఁడు శంఖచూడుఁడు వాసుకిచేఁ బరిత్యక్తుఁడై వైనతేయుని నోటఁ బడఁబోవ నున్నాఁడని తెలిసికొని తటాలున నచ్చటికివచ్చి, యాత్మార్పణ నిశ్చయమానసుండై, మిక్కిలి పరిదేవనము గావించుచున్న వృద్ధనాగమాతను "తల్లీ దుఃఖపరాధీనవు కాఁబోకుము. వైనతేయునకు నా శరీరము నిచ్చి నీ పుత్రుని రక్షించెద" నని యూరడించెను. అట్లాత్మప్రాణదానమునకు సంసిద్ధుఁడైన యా యొడయని నిర్వ్యాజమైన దయాళుత్వమును మిక్కిలి శ్లాఘించి,

"జనియించును. మరణించును
గన మాదృశ నీచజంతుగణము పరార్థ
మ్మునకై నడుముం గట్టెడు
ఘనులౌ త్వాదృశుల జన్మకలుగుట యున్నే?"

యని జీమూతవాహనునివంటి మహాసత్త్వునిఁ "మీ కిట్టి నిర్బంధముతో నేమిపని? దయచేసి మీ నిశ్చయమును మానుకొను"మని ప్రబోధించినాఁడు.

"శంఖధవళమగు శంఖపాలవంశమును శంఖచూడుఁడు మలినీకరింపఁ జాలఁడు సుమా"యని జీమూతవాహనుని సాహాయ్యమును దిరస్కరించినాఁడు. తనకు సంభవింపబోవు విపత్తునకై దుఃఖించుచున్న తల్లి ప్రాణములు వీడకుండునట్టి యుపాయము నాలోచింపమని ప్రార్థించినాఁడు. ఎట్టులో జీమూతవాహనుఁ డా శంఖచూడు నొప్పించుటకై ప్రయత్నించెను. కాని, విఫలమనోరథుఁ డయ్యెను. గరుడుఁడు వచ్చువేళ సమీపింపక పూర్వమే దక్షిణగోకర్ణునికిఁ బ్రదక్షిణ మొనర్చి వత్తునని నిర్ధరించుకొని, తల్లి వెంటరాగా శంఖచూడుఁ డచటికనతిదూరమున నున్న యాలయమునకుఁ బోయెను. అది చక్కని యవకాశ మని జీమూతవాహనుఁడు కంచుకి వైవా

హింసాచారము చొప్పున నిచ్చిన రక్తాంబరములనే, వధ్యచిహ్న ములుగా ధరించి, శంఖచూడుఁడు వచ్చులోపల నా వధ్యశిలపైఁ దా నాసీనుఁ డయ్యెను. ఇంతలో గరుడుఁడు వచ్చి వధ్యశిలపై నున్నది నాగుఁడే యనుభ్రాంతితో, నా విద్యాధరుని ముక్కునఁ గఱచుకొని మలయశిఖరము పై కెగిరిపోయెను. ఇత్యాదిసన్నివేశ ములలో శంఖచూడుఁడు ప్రదర్శించిన యాత్మనిశ్చయజ్ఞానము, దైవభక్తి, ప్రభుభక్తి పరాయణత్వము, మాతృప్రేమ, మొదలుగాఁ గల విశిష్టగుణము లన్నియు నతని యుదాత్త ప్రకృతికిని, వంశ గౌరవమునకును బతాకప్రాయము లనిన నతిశయోక్తి కానేరదు.

శంఖచూడుఁడు గోకర్ణమున కరిగి, దేవుని దర్శించుకొని, మఱల వధ్యశిలను సమీపించెను. అచటఁ గల రక్తధారను జూచి గరుడుఁడు జీమూతవాహను నెత్తుకొనిపోయి యుండునని భావించి మిక్కిలి వాపోయెను. స్వామి యాజ్ఞను నిర్వహింప లేకపోయితినే యని మిక్కిలి చింతించెను. అన్యరక్షితుఁడ నైతి నని మిక్కిలి దుఃఖించెను. కావున నిట్టి కల్మషచిత్తముతో జీవించియుఁ బ్రయో జనము లేదని నిర్ధరించుకొని, రుధిరధార ననుసరించి, గరుడుఁడు పోయిన జాడను నెమకుచు నడువసాగెను. మధ్యేమార్గమున రుధిరార్ద్రమాంసకేశములతోఁ గూడిన చూడామణిని బరిశీలించి చూచుచున్న జీమూతవాహనుని దలిదండ్రులను గలిసికొని, యా చూడామణి జీమూతవాహనునిదే యని నిక్కము వక్కా ణించెను. ఆ వృద్ధదంపతులను, మలయవతిని వెంట నిడుకొని గరు డుని జాడను బట్టి మలయగిరి సానువుల వెదకుచు నొక్కచోఁ బ్రాణావశిష్టుఁడై పడియున్న జీమూతవాహనుని జూడఁ గల్గెను. అట్లు శంఖచూడుఁడు గరుడుని సమీపించి "మహాత్మా, సాహసము వలదు. నీవు భక్షించువాఁడు నాగుఁడు కాదు. అతఁడు విద్యా ధరుఁ డైన జీమూతవాహనుఁడు. ఇదిగో నన్ను భక్షింపుము.

వాసుకిచే నీ కాహారముగా నియోగింపఁబడిన వాఁడను నేనే. నన్ను భక్షింపు" మని మిక్కిలి ప్రార్థించెను. ఖగపతియు నిద్దఱను బోల్చి చూచుకొని, నిజమును గ్రహించి, తన యసమీక్ష్యకారిత్వమును నిందించుకొనుచు మిక్కిలి వాపోయెను. ఇత్యాది సన్నివేశములలో శంఖచూడుఁడు ప్రదర్శించిన నైఖరి శంఖధవళమైన శంఖచూడుని కులమునకు వన్నెఁ దెచ్చునదనిన నతిశయోక్తి కానేరదు.

శంఖచూడుఁడు మిక్కిలి పశ్చాత్తప్త హృదయుఁడు. ప్రాణావశిష్టుఁడై గరుడుని ముందఱఁ బడియున్న జీమూతవాహనుని జూచినప్పుడు మిక్కిలి దుఃఖించినాఁడు. గరుడుని యసమీక్ష్యకారిత్వమును నిందించినాఁడు. క్షణక్షణము మరణమును మించిన యీ యాతన ననుభవించుటకంటే తల్లి గర్భమునందే మరణించి యుండిన బాగుండునేమో యని మిక్కిలి వాపోయినాఁడు. ప్రాణావశిష్టుఁడై నేలఁ బడియున్న జీమూతవాహనుని జూచి,

"నీ తనువుఁ బలి వెట్టితి
నా తనువుఁ గావఁ బక్షినాయకు వలనన్
బాతాళతలము కంటెన్
లోతున ననుఁద్రోయఁ బోలునో మఱి నీకున్"

అని మిక్కిలి యావేగమును బ్రకటించినాఁడు. రక్తమాంసములతో నిండి యున్న జీమూతవాహనుని శరీరమును బ్రక్కన పడియున్న వస్త్రముతోఁ గప్పి, యట్టి యవస్థలోఁ బడియున్న నాతని శరీరమును దలిదండ్రుల కంటఁ బడకుండునట్లు చేసినాఁడు. జీమూతవాహనుఁడు మరణించిన పిమ్మట నా మహామహునకు జీమూతకేతువు నాజ్ఞ మేరకుఁ జితి పేర్చినాఁడు. అందఱు చితిలోఁ బ్రవేశించుట కుపక్రమించి పోవుచున్న సందర్భమునఁ, దాను గూడ వారి ననుసరించి చితిలోఁ బ్రవేశించుట కాయత్తపడినాఁడు. ఇత్యాది

సంఘటనలలో శంఖచూడుని యుత్తమ శీలము చక్కఁగా వ్యక్త మగుచున్నది. ఈ నాటకమునందు బోధిసత్త్వుఁడే యనఁదగిన జీమూతవాహనుఁడు ప్రదర్శించిన ప్రాణదానత్యాగమున కన్నను, నీచజంతుగణమునకుఁ జేరిన శంఖచూడుఁడు ప్రదర్శించిన ప్రాణదానత్యాగ మత్యుత్తమ మైనదని చెప్పవచ్చును.

## విదూషకుఁడు (నాయకుని మిత్రుఁడు)

నాగానందము నందలి విదూషకుఁడు సంపూర్ణముగా హాస్యరస ప్రియుఁడు. సర్వసామాన్యముగా సంస్కృతనాటకముల యందు విదూషక పాత్రలు హాస్యరసపరిపోషకములై యుండును. వికృతమైన వేషము, భాష, చేష్టలు గలవాఁడు విదూషకుఁడు. అట్టి హాస్యరసప్రియుఁడైన విదూషకుఁడు నాయకునకు వేడుక చెలికాఁడు. అతఁడు మాటలచేతను వేషముచేతను, చేష్టలచేతను ప్రేక్షకులకు నవ్వును బుట్టింపఁ జేయుచుండును. విదూషకులలో, వక్రోక్తి మర్యాదలతో విమర్శించి, రాజుల దోషముల నెత్తి చూపువారును గొందఱు గలరు. కొందఱు మందబుద్ధులుగను, నల్పసంతోషులుగను, భోజనప్రియులుగను నుందురు. హాస్యము వారికిఁ బెట్టని సొమ్ము. నాయకునకు శృంగారమున సహాయపడువారిలో విదూషకుఁ డొకఁడని చెప్పఁదగును. సామాన్యముగా వసంతుని హాస్యము పామరజనరంజకముగా నుండును.

ఇతఁడు జీమూతవాహనునకుఁ బ్రియమైన మిత్రుఁడు. బ్రాహ్మణ వంశమున జన్మించినవాఁడు. ఆత్రేయ నామధేయుఁడు. ఇతఁడు విద్యాగంధములేని మహాబ్రాహ్మణుఁడు. మందమతి. విద్యాగంధములేని వాఁడైనను గొన్ని పట్టులఁ దెలివితేటలను బ్రదర్శించినాఁడు. "మిత్రమా, నీ ప్రతిపక్షుఁడైన మతంగహతకుఁడు

మిక్కిలి సాహసికుఁడు. వాఁడు దాపుననుండఁగా రాజ్యము ప్రధానామాత్యుల పరామరికయం దున్నను, నీవు లేనిదే సురక్షితము కాఁగలదని నాకుఁ దోఁచుటలే" దని జీమూతవాహనుని హెచ్చరించినాఁడు. అన్నివేళలయందును నాయకుని వెన్నంటియే యుండి యతని నుత్సాహపఱచుచుండవలయు ననెడి యాశయమును గల్గి యుండెడివాఁడు. గౌర్యాలయమున మలయవతి యాసీనయై వీణ వాయించుచుండఁగా విదూషక జీమూతవాహను లచ్చటికి వచ్చిరి. జీమూతవాహనుఁ డామెను జూడవలయు ననెడి యుత్కంఠతో నుండియు, లోపలఁ బ్రవేశించుటకు సంకోచించుచుండెను. ఆ విషయమును గుర్తించి, నాయకుని బలవంతముగా లాగుకొనిపోయి లోపలఁ బ్రవేశించెను. గార్హస్థ్య వాంఛయే లేని జీమూతవాహనుఁ డా ముగ్ధను జూచి ప్రణయలోలుఁ డయ్యెను. విదూషకుఁ డీ సన్నివేశమున నాయకుఁ డా ముగ్ధయందు బద్ధానురాగుఁ డౌటకుఁ దగిన నైపుణ్యమును బ్రదర్శించి, మలయవతిని నిజసంభాషణా చాతుర్యముచే నటఁ గొన్ని గడియలు నిలుపఁ గలిగెను. అది కారణముగాఁ దన మిత్రుఁ డా కన్యను వలచి వలపించుకొనెను.

నాయకుఁడు మలయవతిని జూచిన నాఁటినుండియుఁ దద్విషయకమగు నుత్కంఠతో మిగుల నస్వస్థముగ నుండఁగా, విదూషకుఁ డా యొడయని గడు జాగరూకతతో వినోదపఱచుచుండెవాఁడు. వలకాకచే నలుగుడువడుచున్న జీమూతవాహనుని చందనలతాగృహమునకుఁ దీసికొని పోయినాఁడు. శిలాఫలకమున మలయవతిని జిత్రించి యాత్మను వినోదపఱచుకొందు నన్న నాయకునకు మనశ్శిలా శకలములఁ దెచ్చి యిచ్చినాఁడు. నాయకుఁడు మఱొక స్త్రీని ప్రేమించినాఁడని భ్రాంతిపడిన మలయవతియుఁ జేటికయుఁ బలువిధములుగా వాపోవుచుండఁగా విదూషకుఁడు ప్రదర్శించిన సమయస్ఫూర్తియుఁ బరిశీలనాశక్తియు మిక్కిలి మెచ్చుకొనఁ దగినవి.

వివాహానంతర ముద్యానవనములో నాయికానాయకు లేకాంతముగ విహరించు సందర్భమును గల్పించుటకై, చతురిక తన ముఖమునకుఁ బూసిన తమాలపల్లవ రసమును గడుగుకొని వచ్చెదనను నెపంబున నిష్క్రమించినాఁడు. ఇట్టి శృంగార సన్నివేశములలో విదూషకుఁడు నాయకునకుఁ జేదోడు వాదోడుగాఁ బ్రవర్తించుకొనినాఁడు.

విదూషకుని హాస్యము పామరజనరంజకముగా నున్నది. ఇతని వికృతరూపమునకును, వికారచేష్టలకును దృతీయాంక కథ ప్రబల నిదర్శనమై యున్నది. కుసుమాకరోద్యానమునఁ బ్రవేశించి నప్పుడు తుమ్మెదలు బాధించినవి. మధుకరములను బానిసకొడుకు లని తిట్టుటయు, మలయవతి వలన వివాహకాలమున లభించిన పెట్టి పంచెలచాపుతో స్త్రీ వేషము ధరించి, ముసుఁగిడుకొని పోవుటయు, మొదలుగాఁ గల విషయము లీ విదూషకుని స్వభావమును వ్యక్త పఱచుచున్నవి. శేఖరకుఁడను విటుఁడు మధుపానమును గావించి మైకముతోఁ దన ప్రియురాలైన నవమాలికను వెదకుచుఁ గుసుమాకరోద్యానమునకు వచ్చునప్పుడు, మధ్యే మార్గమున స్త్రీ వేషమును ధరించి వచ్చుచున్న యీ విదూషకుఁ డెదురైనాఁడు. నవమాలిక యను భ్రాంతితో నాతఁడీ విదూషకుని గౌఁగలించుకొని నాఁడు. ఈ సందర్భమున మధుకరముల బాధనుండి తప్పించుకొన్న విదూషకుఁడు మధుకరుని బారిఁబడి వాపోయినాఁడు. శేఖరకుఁడు నవమాలికయే కదాయని బతిమాలుకొను సందర్భమునఁ గల్లు వాసన కసహ్యపడుచు ముక్కులు మూసికొని దూరముగాఁ బోవుటకై ప్రయత్నించు విదూషకుని చేష్టలు హాస్యరస పరిపోకములై యున్నవి.

శేఖరకుని ప్రియురాలైన నవమాలిక ప్రవేశించినప్పుడు విదూషకుఁడు మేలిముసుఁగును దొలఁగించి నేను విదూషకుఁ డనని

యొఱుకపఱచుకొనినాఁడు. నవమాలికయు విదూషకుని నెగతాళి చేయవలయునని సమకట్టి, తన కాళ్ళమీఁదఁ బడినచో శేఖరుని బారినుండి రక్షించెదనని చెప్పినది. విదూషకుఁడు, "గంధర్వరాజ మిత్రుఁడను, బ్రాహ్మణుఁడనునైన నేను నీ పాదములపైఁబడుదునా" యని నవమాలిక చిలిపితనమున కులికిపడి పలికినాఁడు. శేఖరకుఁడు "పండుకోఁతీ" యని యితనిని సంబోధించినాఁడు. ఇత్యాది సన్నివేశము లీ విదూషకుని వికారపు చేష్టలను వికృతాకారమును వ్యక్తపఱచుచున్నవి. ఆత్రేయ నామధేయుఁడైన యీ విదూషకుఁడు నాటకమున మొదటి మూఁడంకముల యందును నాయకునకు సహచరుఁడై మెలగినాఁడు. ఈ నాటకమున వర్ణింపఁబడిన విదూషకుని లోఁజేష్టలయందును, వేషమునందును వికారత్వము గన్పించుచున్న దేకాని, భాషయందేమాత్రము వికారత్వము గన్పించుట లేదు. మీఁదు మిక్కిలి యీతని నోట వెలువడిన శబ్దజాల మార్యజనోచితమని చెప్పవచ్చును.

## గ రు డుఁ డు (పక్షిరాజు, నాగశత్రువు)

గరుడుఁడు దివ్యాదివ్యుఁడు. మిక్కిలి భయంకరస్వరూపుఁడు.

"ఇందుని గాంచి భీతివలయిాకృతమూర్తిని శేషు నెంచుచున్
స్యందనఘోటముల్ బెదరి యర్కుఁడు తొట్రిల, నగ్రజుండు నా
నందముగా ననున్ గన, ఘనవ్రజవిస్తృతపక్షశాలినై,
యందితి నబ్ధితీరమలయాగము వేగమ భోగిభుక్తికిన్"

"అహో! తెలిసెను మజ్జవానిలహతిన్ జలియించెను
పారిజాతమున్ విలయవిశంకఁబెల్లుటిమె నిక్కముగాఁ
బ్రళయాంబుదాళియున్".

ఇత్యాది విషయములను బట్టి గరుత్మంతుఁడు ధీరోద్ధతుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు. ఇతఁడాత్మశ్లాఘకలవాఁడుగా నున్నాఁడు. అసహాసము, నహంకారము నీతని యందు రూపుదాల్చి యున్నవి.

అట్టి భయంకరస్వరూపుఁడైన యీ వినతానందనుఁడు ప్రతిదినంబును స్వపక్షమారుతంబున సాగరజలంబుల నెగురఁగొట్టి, పాతాళలోకంబున కేఁగి భుజంగములఁ గొనివచ్చి భుజించుచుండెడివాఁడు. భయంకరుఁడైన యీ గరుత్మంతుని యాగమనత్రాసంబున భుజంగాంగనలకు గర్భస్రావం బగుచుండెను. క్రమక్రమముగా భుజగకులసముదాయము నశింపసాగెను. నాగరాజైన వాసుకి సమస్త నాగలోకవినాశమును శంకించి, గరుత్మంతునితో ''మహాత్మా భవదీయాగమనత్రాసంబున సర్పాంగనలకు గర్భస్రావమగుచున్నది. అట్లయినచో మా సంతతి కొలఁది కాలములోనే నశించిపోవును. అప్పుడు నీకు స్వార్థహాని లభించును. నీవు నేఁటినుండియుఁ బాతాళమునకు రాకుండ సముద్రతీరమున నుండుము. ప్రతిదినంబు నొక్కొక్క సర్పమును నీ యొద్దకుఁ బంపుచుందు''నని యొక నియమమును జేసికొనియెను. అది కారణంబుగా నీ గరుత్మంతుఁడు ప్రతిదినము నొక్కొక్క భుజంగమును జంపి తినుచుండెను. అట్టి యురగ సంతతుల యెమ్ములు గిరులవలెఁ బెరిగి, మలయగిరి పరిసరముల శరన్మేఘములచే నాక్రమింపఁబడిన మంచుఁగొండ శిఖరములా యన నొప్పియుండెను.

వాసుకికిని గరుడునికిని జరిగిన నిబంధనప్రకార మొకనాఁడు శంఖచూడుఁడను నాగకుమారుఁ డా సుపర్ణుని కాహారముగా సముద్రతీరమునకుఁ బంపఁబడెను. ఆత్మార్పణనిశ్చయమానసుండైన జీమూతవాహనుఁ డా నాగకుమారు నెట్లైనను రక్షింపవలయు ననెడి దీక్షతో, నవకాశమును బురస్కరించుకొని, శంఖచూడుఁడు దక్షిణ

గోకర్ణ దర్శనార్థమై యరిగియున్న తఱి, వధ్యశిలపై నాసీనుఁడై యుండెను. అంతలోపల గరుత్మంతుఁ డచ్చటికివచ్చి నాగుఁడే యను భ్రాంతితో నా విద్యాధరుని నోటఁ గఱచుకొని ఱివ్వునఁ బైకెగిరి పోయి మలయశిఖరముపై నుంచుకొని భక్షింపసాగెను. ఖగేశ్వరుఁ డట్లు జీమూతవాహనుని భక్షించుచున్న సమయమున నాతఁ డే మాత్రము వ్యధ చెందక సంతోషముతో "మహాత్మా, నా శరీరమునందు రక్తమాంసము లింకను గలవు. నీవు సంకోచింపక భక్షింపవలసిన"దని వేఁడుకొనుచుండెను. అట్టి వింత ప్రకృతి గల పుడమిపతి వైఖరి ఖగేశ్వరు నాశ్చర్యచకితునిగాఁ జేసెను. భక్షించుటను మానుకొని, యీ మహనీయుఁ డెవ్వఁడై యుండునా యని మిక్కిలి సంకోచించుచుండగా నింతలో శంఖచూడుఁ డచ్చటికిఁ బర్వెత్తుకొనివచ్చి గరుడుని బురస్కరించుకొని "మహాత్మా, సాహసమువలదు. నీవు భక్షించువాఁడు నాగుఁడుకాఁడు. అతఁడు పరోపకారదీక్షాపరతంత్రుఁడైన విద్యాధరుఁడు. నేనే వాసుకిచే నీ కాహారముగా నియోగింపఁబడినవాఁడను. నన్ను భక్షింపు" మని ముందునకు వచ్చెను. గరుత్మంతుఁడు నివ్వెఱబోయి యిద్దఱను బోల్చి చూచుకొని, తన యవివేకమునకు మిక్కిలి చింతింపసాగెను. ఇత్యాది సన్నివేశములను బరిశీలించినచో గరుత్మంతుని యసమీక్ష్యకారిత్వము, నవివేకము వ్యక్తము గాకపోదు.

పై వివరింపఁబడిన విషయములలో గరుడుఁడు ప్రదర్శించిన వైఖరి యాతని మనస్తత్వమును జక్కఁగా వ్యక్తపఱచుచున్నది. శంఖచూడుఁడు పర్వెత్తుకొనివచ్చి నిజమును దెల్పిన సందర్భమున నతని యవివేకమును గూర్చి మిక్కిలి నిందించుకొనెను. 'అయ్యో, నే నీ మహాత్మునకు బాధను గలిగించి, యపయశఃపంకమున మునిఁగిపోయితినిగదా" యని మిక్కిలి వాపోయినాఁడు. అతని ముందఱఁ బ్రాణావశిష్టుఁడై పడియున్న జీమూతవాహను నట్టి స్థితి

యందుఁ జూడవచ్చి, మిక్కిలి దుఃఖించుచున్న జీమూతవాహనుని తలిదండ్రులను, భార్యను జూచి మిక్కిలి వాపోయినాఁడు. "మహాత్మా, నరకజ్వాలలు ముట్టినట్లు దుఃఖ మనుభవించుచున్న నా పాపమునకు నివారణోపాయము నుగ్గడింపు" మని జీమూతవాహనుని ప్రార్థించినాఁడు. ఇత్యాది సన్నివేశములలో ఖగేశ్వరుఁడు ప్రకటించిన మనస్తత్త్వము మిక్కిలి పశ్చాత్తాపమును ప్రకటించుచున్నది.

అట్లు గరుడుఁడు మిక్కిలి పశ్చాత్తాప హృదయుఁడై, ప్రాణావశిష్టుఁడై యెదుటఁ బడియున్న బోధిసత్త్వుని, తా నొనర్చిన పాపమునకుఁ బరిహారమార్గమును సూచింపమని వేఁడుకొనినాఁడు. జీమూతవాహనుఁడు తండ్రి యనుమతితో నాతనికిఁ బాపపరిహారము నీ క్రింది విధముగా నుపదేశించినాఁడు.

"ప్రాణివధమ్ము మాను మిఁక............భూత సంతాన మభీతిఁగాంచఁగఁ దనర్చుము.........నిష్ఫలంబగుఁ" ఇత్యాది యుపదేశ వాక్యములను బాటించి, "సుచిరమజ్ఞాన నిద్రాప్రసుప్తుఁడైన నన్నుఁ బ్రతిబోధితుం జేసినావు నీవు, సర్వజంతువధ క్రూరచర్యనుండి యీక్షణ మ్మాదిగా విరమించినాఁడ" నని శపథ మొనర్చి నాఁటినుండియు నీ గరుత్మంతుఁడు ప్రాణివధమ్ము మానుకొనినాఁడు. జీమూతవాహనుఁడు మరణించిన పిమ్మట స్వర్గమున కేఁగి యమృతవర్షమును గురియించినాఁడు. అది కారణముగాఁ జిరకాల శల్యావశేషములైన యాశీవిషము లన్నియుఁ బునర్జీవములతోఁ బాతాళమున కేఁగినవి. పై విషయములను బరిశీలించినచో, గరుత్మంతుఁడు జీమూతవాహనుఁడు గావించిన యుపదేశపర్యవసానముగా, మొదట నెంతటి భయంకరస్వభావుఁడుగ నుండెనో యంతటి శాంతోన్ముఖ స్వభావము గలవాఁడుగ మాఱిపోయినాఁడు.

## మ ల య వ తి (కథానాయిక)

ఈ నాటకమునందు మలయవతి కథానాయిక. ఈమె సిద్ధ రాజైన విశ్వావసువున కనుఁగుఁ బుత్రిక. మిత్రావసువునకుఁ బెరిమంపు సోదరి. ఉత్తమకులసంజాత. ఉదాత్తప్రకృతి గలది. గుణవతి. విద్యావతి. రూపవతి. శీలవతి. యౌవనారంభమునుండి, విశేషముగా లజ్జించు స్వభావముగలిగి యుండెడిది గాన నీమె ముగ్ధనాయిక యగుచున్నది. సంగీతశాస్త్రమునం దారితేరిన పాండిత్యము గలది. సీత, శకుంతల, సావిత్రి మొదలుగాఁగల యుత్తమనాయికలతోఁ బోల్పఁ దగిన యువతీలలామ. క్రోధాహంకారములు లేనిది. మధురభాషిణి. ఈమె సౌందర్యము నిరుపమాన మైనది. గ్రంథకర్త యీ ముగ్ధనాయిక సహజ మనస్తత్వమును జక్కఁగాఁ బోషించి, స్త్రీ జనములకుఁ దలమానికముగాఁ దీర్చి దిద్దినాఁడు.

స్వరూపముచేతను, స్వభావముచేతను నీ యందాలబరిణె రూపము, యౌవనము, ప్రభుత్వము గలిగిన విద్యాధర సార్వభౌముఁడైన జీమూతవాహనుఁడు, తనకు వరుఁడుగా లభింపవలయు నని, గౌరిని గూర్చి వ్రత మాచరించుచుండెడిది. గౌరియు నామె సంగీత విద్యా విజ్ఞానమునకు, నబలాజనదుర్లభమగు భక్తికి మెచ్చి, విద్యాధరచక్రవర్తి యామెకు భర్త కాఁగలఁ డని వరమిచ్చెను. ఈమె గౌరిని గూర్చి ప్రార్థించు నపుడు ప్రదర్శించిన సంగీత విద్యా కౌశల మనుపమానమైనది. ఉబుసుపోకకై విదూషకునిగూడి గౌర్యాలయ పరిసరములఁ దిరుగాడుచుండిన జీమూతవాహనుఁడా సిద్ధాంగన వీణాగానమును విన్నాఁడు. ఆ గానము వీనులఁ బడినంతనే యయ్యది పురుషహస్త సాధనము గాదనియు, నట్లు వాయించున దెవ్వతయో దేవయువతియై యుండనోపు ననియు నూహింపఁగలిగి

నాఁడు. ఆ యువతి ప్రదర్శించిన గానప్రభావముచే, మిక్కిలి నిక్కిన వీనులొగ్గి, యానందముచేఁ గన్ను లరమోడ్చి, హరిణములుగూడ నాకర్షింపఁబడినవి.

ఆమె శాస్త్రోక్తమైన గానము సల్పఁగల జాణ యనుటకు జీమూతవాహనుఁ డామె యాలపించిన గాన స్వభావమును గూర్చి వివరించిన విధానమువలన ద్యోతకము గాకపోదు.

"స్థాన సంప్రాప్తిఁ దార మంద్ర వ్యవస్థలమరఁ
ప్రకటిత దశవిధగమక మగుచు"

"దశవిధ వ్యంజన ధాతువుల్ గూడి
వ్యక్తి సాధింపఁగాఁబడె నీమెచేత"

ఇత్యాది వర్ణనములఁ బట్టి మలయవతి సంగీతవిద్య యెంతటి శాస్త్రోక్తమైనదో వ్యక్తమగుచున్నది.

జీమూతవాహనుఁ డట్టి వీణాగానము వీనులఁ బడినంతనే, యట్లు వాయించు వా రెవ్వరో యెఱుంగఁగోరి గౌర్యాలయమును సమీపించెను. వీణ వాయించుచు నరమోడ్పుఁ గన్నులతో నున్న మలయవతిని జూచి యామె సొగసున కచ్చెరువందెను.

మలయవతికిఁ గల సంగీతవిద్యాపరిజ్ఞానమునకు వన్నె దెచ్చు రూపరేఖావిలాసము లనుపమానము లైనవి. విదూషకుఁ డామెను జూచి జీమూతవాహనునితో "మిత్రమా, చూడు చూడు. ఆశ్చర్య మాశ్చర్యము. కేవలము వీణావిజ్ఞానముచేత వీనులకు విందుసేయు టయే కాదు. ఈ వీణావిజ్ఞానమునకు దీటైన రూపముచేతఁ గన్నులకుఁ గూడ పండువు సేయుచున్నదయ్యా, మఱి యీమె దేవతయా? కానిచో నాగకన్యయా? లేనిచో విద్యాధరదారికయా? పోనీ సిద

కుల సంభవయా? అని" ప్రశ్నించినాఁడు. జీమూతవాహనుఁడును "ఈమె దివ్యాంగనయేని దేవేంద్రు చక్షుస్సహస్రమ్ముఁ జరితార్థ మగును........" అని మలయవతి యందచందములను గూర్చి వర్ణించినాఁడు. గార్హస్థ్య వాంఛయే లేక, సదా తల్లిదండ్రుల సేవ యందే నిమగ్నుఁడై యున్న బోధిసత్త్వుఁడే, యీమె రూపరేఖా లావణ్యములచే నాకర్షింపఁబడి, ప్రథమదర్శనమునసే యీ నెలఁతుకను వలచి, వలపించుకొనినాఁడు. ఇత్యాది విషయములను బరిశీలించినచో మలయవతి మిక్కిలి యందకత్తె యని తోపకపోదు. అట్లు జీమూతవాహనుని విమోహితుని గావింపనేర్చిన యీమె సౌందర్యము వర్ణనాతీత మైనదనిన నతిశయోక్తి కానేరదు.

ఈమె రూపరేఖావిలాసాదులచేఁ ద్రిభువనఖ్యాతి గాంచిన విద్యాధరసార్వభౌముని త్రికరణశుద్ధిగాఁ బ్రేమించినది. ఆ సార్వ భౌముని వలచి, వలపించుకొన్నది. తన హృదయాధినాథుఁ డగు జీమూతవాహను ననుగమించు భాగ్యమునకై యువ్విళులూరు చుండెను. ఆమె తలిదండ్రులును భవిష్యద్విద్యాధరచక్రవర్తి యగు నా జీమూతవాహనునకే యీమె నిచ్చి వివాహముసేయ సంకల్పించి యుండిరి. గౌర్యాలయమున మలయవతి చేటిమాటున నుండి యోర చూపులతో నా విద్యాధరుని జూచుచుండ, నింతలో శాండిల్యుఁ డను తాపసుఁ డచటికిఁ బ్రవేశించి, యన్యోన్యానురూపదర్శను లగు మలయవతీ జీమూతవాహనులను దిలకించి, వారి నాశీర్వదించెను. మధ్యందిన సవనవేళ యతిక్రమించునేమో యని, మలయవతి కుల పతి యగు కౌశికుని యాజ్ఞను బాటించి నిష్క్రమించెను.

ఆమె జీమూతవాహనుని జూచిన నాఁటి నుండియుఁ దద్విష యక మగు నుత్కంఠతో మిగుల నస్వస్థముగా నుండ నెచ్చెలు లామెను వెంటనే యొక యుద్యానవనమునఁ గల చందన లతా

గృహంబునకుఁ జేర్చిరి. అచట నామె యొక చంద్రకాంత శిలాతలంబున నాసీనయై సేద దీర్చుకొనుచుండెను, వలకాక చే నలుగుడు వడుచున్న యా మలయవతికి నెచ్చెలులు శీతలోపచారములు గావించుచుండిరి. జీమూతవాహనుఁడును నీ యువతీలలామను జూచిన నాఁటి నుండియు, నామె రూపరేఖావిలాసాదులనే స్మరించుకొనుచు, మన్మథవేదనచే బాధనొందుచు, మఱునాఁ డరుణోదయంబుననే, యాపె చందనలతాగృహంబున నుండునేమో యని భావించి, విదూషకునితో నచ్చటికి వచ్చెను. ఎచ్చటఁ జూచినను మలయవతి జాడయే కన్పింపక పోవుటచే నా పరిసరముల నన్నింటిని గాలించి చూచి, యొక్కచోట నాసీనుఁడై, మలయవతి సౌందర్యమునే తలపోయుచు, విదూషకునితో నేమేమో మాటలాడుచుండెను. మలయవతియు సఖీజనపరివృతయై యొక వృక్షమును మాటుగాఁ జేసికొని సర్వమును దిలకించుచుండెను. జీమూతవాహనుఁడు మఱియొక స్త్రీయందు చిత్తమును లగ్నమొనర్చి యాపె ప్రసక్తినె స్మరించుచున్నాఁడను భ్రాంతితో నామె చెలికత్తెలతో నిరాశాభరితయై నిష్క్రమించెను.

నాయకుఁ డింకొక స్త్రీని ప్రేమించినాఁడని మలయవతి భ్రాంతినిబొంది, రహస్యముగా నాత్మహత్యా ప్రయత్నమునకుఁ బూనుకొన్నది. కాని నాయకుఁడు మఱియొక స్త్రీని ప్రేమింపలేదు, మలయవతీ సౌందర్యాకృష్టమానసుండై, యాంపెను గూర్చి స్మరించుకొనుచుండ, మలయవతి పొరబడి జీమూతవాహనుఁ డన్యకాంతాసక్తుఁ డయ్యె నని భావించినది. త్రికరణశుద్ధిగా జీమూతవాహనునే ప్రేమించిన దగుటచే నాతని మన స్తత్వమును గ్రహింపలేక, యాత్మహత్యా ప్రయత్నమునకు బూనుకొన్నది. ఈ సన్నివేశమును బరిశీలించినచో మలయవతి యుచితానుచితవివేకము లేనిదని గోచరించుచున్నది. కంఠమునఁ బాశముంచుకొని ''గౌరీ, యీ జన్మమున

నన్ను దయఁజూడకపోయినను మఱుజన్మము నందైన నిట్లు దుఃఖ భాగినిని గాకుండునట్లు చేయు" మని మరణించుట కుపక్రమింప నుండగాఁ జతురిక యచ్చటకువచ్చి "మా భర్తృదారిక యురిపోసికొని యాత్మహత్య గావించుకొనుచున్న దని బిగ్గఱగా నరచెను. ఆ పరి సరములలోనే మలయవతికై వెదకుచున్న జీమూతవాహనుఁడు తటాలున నా ప్రదేశమునకు వచ్చి మలయవతిని యాత్మహత్యా ప్రయత్నమునుండి రక్షించెను. ఇత్యాది సన్నివేశము లామెకుఁ గల పట్టుదలను, దీక్షను, నిష్కలంకమైన ప్రేమను వ్యక్తపఱచు చున్నవి.

అంతకుఁ బూర్వమే సిద్ధరాజగు విశ్వావసువు, మిత్రావసు వుతో, భవిష్యద్విద్యాధరచక్రవర్తి యగు కుమార జీమూతవాహ నునకు మలయవతి నిచ్చి వివాహముసేయ సమకట్టి యుండెను. మిత్రావసువు మలయగిరి పరిసరములఁ గాఁపురమున్న జీమూత వాహనుని తలిదండ్రులకుఁ దన చెలియలి వివాహవిషయంబు నెఱిం గించి, వారియనుమతి వడసి, కన్యాదానమును నిర్ధరించుకొనివచ్చెను. ఒక శుభముహూర్తమున మలయవతీ జీమూతవాహనుల వివాహము వైభవోపేతముగా జరిగిపోయెను. ఆ ప్రణయమూర్తులు నాఁటఁగోలె నన్యోన్యానురూపయౌవనవిలాసములతోఁ గాలముఁ బుచ్చు చుండిరి.

వివాహానంతర మొకనాఁడు జీమూతవాహనుఁడు మిత్రా వసువు వెంటరాఁగా, మలయగిరి సానువులకుఁ దగులుచున్న సముద్ర వేలను జూడఁబోయెను. మలయవతియు మెట్టినింటి కేఁగి యొక సామాన్య సంసారమందలి కోడలువలె నత్తమామలకుఁ బరిచర్య సేయుచు, వారిని భక్తితోఁ బూజించుచుండెను. వివాహమైన పది దివసముల లోపలనే యత్తవారింటి కేఁగి, యత్తమామలను బూజించు

చుండుటయందు నిమగ్నురాలై యుండె నన్న విషయ మామె యుత్తమపాతివ్రత్యప్రభావమును జాటుచున్నది. ఈమె యసూర్యంపశ్య. రాజభోగముల ననుభవించినది. అట్లయ్యును నరణ్యవాసాయాసమున కోర్చుకొని, యొక సామాన్య కుటీరములోఁ గాఁపుర ముండి, యత్తమామల మన్ననలకుఁ బాత్రురాలైనది.

ఇంతలో హఠాత్తుగ నొక చూడామణి మలయవతి యత్తమామల పాదములపైఁ బడెను. అది రక్తార్ద్రమాంసకేశములతోఁ గూడియుండెను. గరుత్మంతుఁడు పరార్థదత్తదేహుండైన జీమూతవాహనుని, నాగుఁడే యని భ్రమించి, నోటఁ గఱచుకొని మలయశిఖరాగ్రముపై కెగిరిపోవు సందర్భమున, మధ్యేమార్గమున జారి క్రిందఁ బడిపోయినది. ఆ చూడామణి తమ పుత్రునిదై యుండనోపునని శంకించి, వృద్ధదంపతులును, మలయవతియు వాపోవఁ దొడఁగిరి. ఇంతలోపల శంఖచూడుఁ డను నాగకుమారుఁడు పర్వెత్తుకొనివచ్చి, యా చూడామణి త్రిభువనచూడామణి యైన జీమూతవాహనునిదే యని చెప్పెను. అట్టి విషాదవార్తను విన్న మలయవతి మూర్ఛిల్లెను. అందఱు రక్తచిహ్నములతో నొప్పిన మార్గము నన్వేషించుచుఁ బోయి, గరుడుని ముందఱఁ బ్రాణావశిష్టుఁడై పడియున్న జీమూతవాహనుని గలిసికొనిరి.

అట్టిస్థితిలో నున్న భర్తను జూచి మలయవతి మిక్కిలి వైక్లబ్యముతోఁ బరిదేవనము గావింపఁ దొడఁగినది. భర్త మరణించిన వెంటనే తన దురదృష్టమును గూర్చి "ఓసీ నిష్కరుణ హృదయా, వజ్రకఠిన దేహా, మలయవతీ, ప్రాణనాథుని వీడి యింకను జీవించియుంటివా!" యని మిక్కిలి నిందించుకొన్నది. తుట్టతుద కత్తమామలతోఁ గూడి యగ్నియందుఁ బడి మరణించుట కుపక్రమించినది. అవసాన దశయందు గౌరిని స్మరించి "భగవతీ, గౌరీ, విద్యాధర చక్రవర్తి నీకు

భర్తకాఁగలఁ'' డని వరమిచ్చితివి గదా! మందభాగ్యురాల నగు నా మూలమున నీవు మిథ్యావచన నైతివిగదా యని మిక్కిలి వాపోవుచుఁ బ్రార్థించినది. ఇంతలో గౌరి ప్రత్యక్షమై యబలాజనదుర్లభమైన మలయవతి భక్తికి మెచ్చి, జీమూతవాహనుని బ్రతికించినది. ఈ విధముగా కథానాయిక యైన మలయవతి శాల్యదుర్లభంబును, నసాధారణంబును నైన భక్తి ప్రతిపత్తులతో గౌరి యాదరమునకు గుఱియై, విద్యాధరుని వివాహమాడుటయే కాక, యకాలమరణము వాతఁబడిన జీవితేశ్వరుని బ్రతికించుకొని, ముల్లోకములలోఁ గల స్త్రీజనంబులకుఁ దలమానిక మైనది. అట్టి విద్యాసరస్వతియుఁ, ప్రేమ మూర్తియు, నుత్తమ పతివ్రతయు నగు మలయవతి మనకు మఱపునకు రానిపాత్ర యనిన నతిశయోక్తి కానేరదు.

---

## గుణదోషములు

### సాంఘిక పరిస్థితులు.



గుణములు:— నాగానందనాటకము విద్యాధర జాతకములో నభివర్ణింపఁబడియున్న జీమూతవాహనుని కథను మూలాధారముగాఁ జేసికొని రచియింపఁబడినది. ఈ నాటకము నందు శ్రీహర్షుఁ డొక యపూర్వ మానసికనిరూపణ మొనర్చినాఁడు. హర్షుని కాలములో బ్రాహ్మణమతమునకు బౌద్ధమతమునకుఁ గల సంబంధ బాంధవ్యము లీ నాటకములో విస్పష్టములగు చున్నవి. అన్ని సన్నివేశములలోను బ్రాహ్మణ బౌద్ధ భావములు సమ్మిశ్రములై చిత్రింపబడియున్నవి. ఈ నాటక మానాఁటి సంఘమునందుఁ గల మతసహనమునకు దర్పణము. ఆనాఁడు బ్రాహ్మణమతము పునరుద్ధరింపఁబడుచుండెను. క్రీస్తుశకారంభమునుండియు బౌద్ధమతము చ్చస్థితి యందుండెను. భారతదేశములో బౌద్ధమతము సర్వత్ర వ్యాపించి, యితర మతముల నణచివేసినది. నాల్గవ శతాబ్దమునందు గుప్తులకాలమునుండియు బ్రాహ్మణమతపునరుద్ధరణము ప్రారంభమైనది. తర్వాతఁ గొన్ని శతాబ్దములవఱకు బ్రాహ్మణ బౌద్ధమతములు రెండును సమాన బలముతో వర్ధిల్లుచు వచ్చినవి. ఆ రెండు మతములకు నొకవిధమైన స్పర్ధ యుండెడిదని చెప్పవచ్చును. రాజులు మతసహనమును బాటించిరి. బ్రాహ్మణులు బౌద్ధులను గౌరవించు చుండిరి. బౌద్ధులు పురాతన సంస్కృతకావ్యములను జదువు చుండిరి. వారు సంస్కృతభాషలోఁ గావ్యములను వ్రాయసాగిరి. విశిష్టమైన సంస్కృత కావ్యముల ననువదించిరి. ఎనిమిదవ శతాబ్దమువఱకు నట్టి వాతావరణమే బ్రాహ్మణ బౌద్ధమతముల మధ్య గొనసాగుచు వచ్చినది. తర్వాత నా రెండు మతములకుఁ బరస్పర

వైషమ్యములు చెలరేఁగి, యొకరి నొకరు దూషించుకొనుటయుఁ, జంపుకొనుటయు, జరుగుచుండెడిది. ఎనిమిదవ శతాబ్దమునకుఁ బూర్వమే వ్రాయఁబడిన కాళిదాసు, శూద్రకుఁడు, శ్రీహర్షుఁడు, భవభూతి మొదలుగాఁ గల కవులు తాము రచించిన నాటకము లలో బౌద్ధపాత్రలను బ్రవేశపెట్టి గౌరవించిరి. కావున నాగానంద నాటకము బౌద్ధమతాత్మక మయ్యును సర్వజనాదరణీయమై గౌర వింపఁ బడినది.

ఎట్టి గ్రంథమైనను, విశిష్టమైనరచనము గలదిగా నున్నచో నట్టి యుత్తమరచనకు నైతిక ప్రయోజన ముండి తీరవలయు నని, పూర్వ విమర్శకులు నిర్వచించియున్నారు. అట్టి పూర్వ విమర్శకుల యభిప్రాయమును బురస్కరించుకొని నాగానందనాటకమును విమ ర్శించినచో నా నాటకమునకు సంస్కృతవాఙ్మయక్షేత్రమున నొక గరిష్ఠమైన స్థానము లభించుననుటలో సందియముండదు. మోదాంతనాటకమునకన్నను విషాదాంతనాటకము నైతిక ప్రయో జనమున కనువుగా నుండును. విషాదాత్మక కథ, శాశ్వతమైన ప్రభావమును, మానవుని మానససీమయందు నాటుకొనునట్లు చేయఁగల్గును. శ్రీహర్షుఁడు తన నాటకమునందుఁ జిత్రించిన విషాదగాథ, యేదేని దోషముచేతఁగాని, యవివేకముచేతఁగాని, పతనమొందిన యొక మనుజుని చరిత్ర కాదు. పరులను గష్టవిము క్తులను జేయుటకుఁగా నాత్మార్పణముచేసిన యొకానొక పుణ్య మూర్తి వృత్తాంతము. అట్టి యాత్మార్పణత్యాగమునకుఁ బ్రతిఫల మీ ప్రపంచములో నత్యున్నత స్థానము నందుకొనుటయే యగును. అందువలన లోకములో నాత్మబలికన్న నున్నతమైన సుగుణ మింకొకటి లేదని యీ నాటకమున ఋజువైనది.

నాటకకర్త నాయికానాయకుల పూర్వరాగప్రణయకలా పమును బొడిగింపక, వారి వివాహోత్తరభావజక్రీడలను జక్కఁగా

నభినర్ణించినాఁడు (ఉ॥ మూఁడవయంకము). ఇది మిక్కిలి సమంజస ముగా నున్నది. నాయకుని యుదాత్త శీలమునకుఁ బరిపోషకముగా నున్నది. సామాన్యముగా నాటకములన్నియు నాయికానాయకుల వివాహముతో సమాప్తమగుచుండును. వివాహమగుటకుఁ బూర్వము, పూర్వరాగప్రణయ మెక్కువగా వర్ణింపఁబడుచుండును. కాని వివాహోత్తరప్రేమ వివాహపూర్వప్రేమ కన్నను మిక్కిలి పవిత్రమైనదిగా నుండును. ఈ నాటకమునఁ బ్రవేశపెట్టఁబడిన మార్పు మిక్కిలి ప్రశంసనీయమైనది. ఆదర్శప్రాయములైన నాయకుని ధర్మాశయములకు దోహదప్రాయమైనది.

నిస్సంగత్వప్రభావ మీ నాటకమున చక్కఁగాఁ బ్రదర్శింపఁ బడినది. మలయవతి యబలాజనదుర్లభమగు భక్తిప్రతిపత్తులతో గౌరిని గూర్చి తపస్సుచేయును. గౌరియు నచంచలమైన యామె భక్తికి మెచ్చి వరము నిచ్చును. కాని వరమువలన సమకూరవలసిన ఫలితమునకుఁ బూర్వమే నాయకుఁడు శంఖచూడునికొఱకుఁ బ్రాణత్యాగముచేయును. కాని నాయిక యొక్క సన్యాస దీక్షా బలముచేత గౌరి యాతనిని పునర్జీవితుఁ జేసి, యామె కోరిన వరమును సఫలముచేయును.

నాటకకర్త కాలమునఁ గల సాంఘికస్థితి యీ నాటకమునఁ జక్కఁగాఁ బ్రతిబింబించుచున్నది. ప్రజలీనాఁడువలెనే మూఢవిశ్వాసములు గలిగియుండెడివారు. నాగలోకము సముద్రముక్రింద నున్నదనియు, దేవలోక మాకసముపై నున్నదనియు, నింద్రుడు స్వర్గలోకమును బరిపాలించుచున్నాఁడనియు విశ్వసించెడి స్వభావములు గలిగియుండెడివారు. దేవత లమృతసిద్ధులనియు, నమృతము మృతసంజీవిని యనియు నమ్మియుండెడివారు. ఈ లోకమునకును నితర లోకములకును మధ్య రాకపోకలు జరుగుచుండెననియు, సూర్యుని

కన్నఁ జంద్రుఁడే మిక్కిలి యెత్తైన నుండుననియు విశ్వసించు చుండెడివారు. నాగజాతివారిని గూర్చి వారి యుస్త్రీనములు సుస్పష్ట ముగా లేవు. సర్పజాతికివలె వారికిని ఫణములును, కంబుసములును, ఫణములందు మణులును గలిగియుండెడివని తెలియవచ్చుచున్నది. కాని నాగులు మనుజులవలె వస్త్రధారణము చేయుదురనియు, నడతురనియు, మాటలాడుదురనియుఁ జెప్పవచ్చును. గరుడుఁ డన్ని సందర్భముల యందును పక్షిధర్మములను గలిగియుండెడివాఁడు. కాని యతఁడు మనుజులవలె మోకరిల్లుటయు, మాటలాడుటయుఁ, బశ్చాత్తప్తుఁడగుటయు మొదలుగాఁ గల మనుష్యధర్మములను గలిగి యుండెను. ఇట్లానాఁటి ధర్మములన్నియుఁ బరస్పర విరుద్ధములుగా నుండెడివి. నిమ్నజాతులలోని యానాఁటి నైతికప్రవర్తన మున్నత మైనదికాదు. వారి స్థితిగతులు సర్వకాలములయందును నొకటిగానే యుండెనని చెప్పవచ్చును. వారు పర్వదినాలలోఁగూడ మధు పానాదులతో వినోదించుచుండిరి.

## దో ష ము లు.

ఈ నాటకములోఁ గల మొదటి మూఁడంకములకును మిగిలిస రెండంకములకు నెచ్చటను సంబంధమే కన్పించుటలేదు. ఇది గొప్ప పొరపాటు. చరమభాగమున నభివర్ణింపఁబడిన నాయకుని ప్రవర్త నము కొంతవఱకు మొదటిభాగమునం దస్పష్టముగా సూచింపఁ బడినది. కాని యా రెండు భాగములకు సన్నిహిత సంబంధమే లేదని చెప్పవచ్చును. నాటకము తృతీయాంకముతోఁ బరిసమాప్త మును బొందియుండినచో రత్నావళీప్రియదర్శికలవలె నొక మోదాంతమైన నాటిక యై యుండెడిదేమో. కాని వస్త్వైక్యము నకుఁ దగిన నాయకుని యాత్మబలిని సూచించు కొన్ని విషయము లీ భాగమునం దభివర్ణింపఁబడియున్నవి. అట్టి యుద్దేశముతోనే

ద్వితీయభాగమునందుఁ గూడఁ ప్రథమ భాగమునకు సంబంధించిన కొన్ని విషయములు సూచితములై యున్నవి. కాని యొక భాగమును జదువుచున్నప్పుడు మఱియొక భాగమును మఱచిపోదుము. ఒక భాగము యొక్క పురోగమనమునకు మఱియొక భాగ మవసరము లేనట్లుగాఁ గన్పించును.

రెండు భాగముల యందును గథను నడపుటలోఁ గొన్ని లోపములు గోచరించుచున్నవి. మొదటి యంకములో నాయికా నాయకులు గౌర్యాలయమునందుఁ గలిసికొని యన్యోన్యప్రేమ బద్ధులైన కూడ నొకరి నొకరు పూర్తిగాఁ దెలిసికొనలేరు. తెలిసికొనుట కైనను, ప్రయత్నింపలేరు. పరస్పర విజ్ఞానము రెండవ యంకమున నాయిక యాత్మహత్యా ప్రయత్నమున కడ్డము వచ్చునని, కవి యట్టి విజ్ఞానమును గల్పింప లేదను కొనవలసి వచ్చినను, నది స్వభావ విరుద్ధముగా మాత్రము కాన్పించుచున్నది. నాయిక యొక్క యాత్మహత్యా ప్రయత్నమునకుఁ దగినంత కారణము లేదు. నాయకుఁ డింకొక స్త్రీని ప్రేమించినట్లు రూఢికాలేదు. ఆమెను నాయకుఁడు పూర్తిగాఁ దిరస్కరించినట్లును నిర్ధారణ కాలేదు. ఇత్యాది దోషములతో నీ సన్నివేశ మసహజముగా నున్నదని చెప్పవచ్చును.

నాయకునికి మిత్రావసు వెవ్వరైనది చక్కఁగాఁ దెలియును. ఆతని తండ్రియు నితనికిఁ జిరపరిచితుఁడె. వారి యోగక్షేమముల నడిగినాఁడు. అంతటి పరిచయము గల్గియుండియు, జీమూతవాహనునికి మిత్రావసువు చెలియలి వృత్తాంతము తెలియలే దన్న విషయము మిక్కిలి యసంభవమైనది. చతుర్థాంకమున శంఖచూడునిఁ దల్లితోఁ గూడ నిష్క్రమింపఁ జేసిన ఘట్టము మిక్కిలి యసమంజసముగా నున్నది. గరుత్మంతుని రాక సన్నిహితమై యున్నప్పుడు

తన కొఱకుఁ బ్రాణము లర్పింప సంసిద్ధుఁడై యున్న నాయకు నంత వఱకు వలదని వారించి, గోకర్ణేశ్వరునకుఁ బ్రదక్షిణ మొనర్చుటకుఁ బోవుచు నాతని నచ్చటనే వదలిపెట్టి పోవుట, పాఠకుల హృదయమున, నాతనికి నాయకునిచే సంరక్షింపఁబడుట యిష్టమే యను సంశయ ముత్పన్నము గాకపోదు. శంఖచూడుని శీలమున కిది యొక మచ్చ యని చెప్పవచ్చును. ఈ నాటకము నిజమునకు దుఃఖాంత నాటకము. కాని యలంకారశాస్త్రములు నాటకమును దుఃఖాంత మొనర్చుట కొప్పుకొనవు. అది కారణముగా నాటకకర్త చివరిభాగములో గౌరీదేవిని బ్రవేశపెట్టి నాయకుని బ్రదికింపవలసి వచ్చినది.

---

# నీతి

వేదము శబ్దప్రధానమై ప్రభుసమ్మితమైనది. పురాణ మర్థప్రధానమై సుహృత్సమ్మితమైనది. కావ్యము భావప్రధానమై కాంతాసమ్మితమైనది. ప్రభువువలె శాసింపక, మిత్రునివలె నూరక సలహా నిచ్చి యూరకుండక, కాంతవలె సుకుమారముగా మనస్సును గరఁగించి, మానవుఁడు తనకుఁ దానే కర్తవ్యమునకుఁ గడంగునట్లు ప్రేరేపించునది కావ్యమని పెద్దల యాశయము. కావున కావ్య ఫక్కి యుత్తమమైనదని చెప్పవచ్చును. నాటకము కావ్యభేదములలోఁ జేరిన దృశ్యకావ్యము. కావునఁ గావ్యత్వమును బొందిన దృశ్యకావ్యము కాంతవలె మానవునకుఁ దగిన నీతిని, ధర్మములను నుపదేశించుచుండును. దృశ్యకావ్యమునకుఁ గథా చమత్కారముఁ, గవిత్వ సౌష్ఠవము, రసపరిపోషణముఁ బాత్రపోషణము, నీతియుఁ బ్రధానాంగములు. దృశ్యకావ్యములు ప్రదర్శింపఁబడునపుడు ప్రేక్షకుల హృదయపద్మముల యందు నాటుకొను వినయ వివేకాది సుగుణ సంపదయే నాటకమునకు జీవకళ యని చెప్పవచ్చును. కావుననే "కావ్యేషునాటకమ్రమ్య" మ్మను నానుడి యేర్పడినది. అది కారణముగాఁ గాళిదాసు, భవభూతి మొదలుగాఁ గల గీర్వాణ కవులందఱు నాటకములనే యెక్కువగా వ్రాసిరి. సాహిత్యములో నగ్రస్థానము నాటకమున కియ్యఁబడినది. కావుననే 'నాటకాంతంహి సాహిత్యమ్' అని పండితుల యభిప్రాయమును వెలిపుచ్చిరి.

ఈ నాటకమునందు బుద్ధదేవుఁ డిష్టదైవముగాఁ బ్రార్థింపఁ బడియున్నాఁడు. బౌద్ధమత ప్రవర్తకుఁడైన బోధిసత్త్వుని కరుణావృత్తియే యీ నాటకమునందు ప్రధానేతివృత్తము. ఈ నాటకమును జూచినపుడు "అహింసాపరమోధర్మ" యనుసూక్తి ప్రేక్షక

కుల హృదయపేటికల యందు గుప్తముగాక పోదు. ఈ నాటకమునం దభివర్ణింపఁబడిన జీమూతవాహనుని పరోపకారైక దీక్షాపరతంత్రతను గూర్చి విన్నప్పు డమితామితమైన భూతదయ మనసున నాటుకొనక మానదు. ఇఁకఁ బ్రదర్శించినప్పుడు ప్రత్యక్షముగాఁ జూచినచో జీమూతవాహనుని భూతదయను గూర్చి వేఱుగాఁ జెప్పవలయునా! కావున నిది మంచి నీతిబోధకమయిన నాటకరాజము.

ఈ నాటకమునఁ బ్రథమ భాగమునం దెక్కువగా జీమూతవాహనునకుఁ గల పితృభక్తి వెల్లడియగుచున్నది. "పితృపాద సేవవలనఁ గలుగు నానందము నాకితర కార్యములను జేయుట వలనఁ గలుగదు. పితృపాద సంవాహనమువలనఁ గలుగు సుఖము రాజ్యముల నేలినను గలుగదు. తండ్రి భుజింపఁగా విడిచిన దే యమృతము. ఆ రుచి ముల్లోకముల నేలినను గలుగ" దని జీమూతవాహనుఁ డాత్రేయునితోఁ జెప్పినాఁడు. మఱియు మలయపర్వతమున నివాసయోగ్యమగు నాశ్రమపద మొండు నిర్మించుకొని కాఁపురమున్నచో యోగ్యముగా నుండునని చెప్పిన తండ్రి యభిప్రాయమును బాటించి, యితర శంకయే లేక రాజ్యమును సైతము మంత్రుల కప్పగించి మలయగిరికిఁ బయనమైపోయి యరణ్యావాస జీవనము ననుభవించినాఁడు. పితృసేవాపరాయణుఁ డై యా వృద్ధ దంపతులను గంటికి ఱెప్పవోలెఁ గాపాడినాఁడు. ఇత్యాది విషయముల నన్నింటిని బరిశీలించినచో జీమూతవాహనునకుఁ గల యసాధారణమైన పితృభక్తి గోచరించుచుండును. తాను జక్రవర్తి పుత్త్రుఁడయ్యు రాజ్యసుఖముల ననుభవించుట కిచ్ఛగింపలేదు. పండి పరువముమీఱిన తల్లిదండ్రులకుఁ బరిచర్య సేయుటయే పరమావధి యని భావించినాఁడు. ఇత్యాది విశిష్టమైన విషయములతోఁ నొప్పిన నాగానందనాటకమును జదువుచున్నప్పుడుగాని, ప్రదర్శించు

చున్నప్పుడుగాని, గోచరించెడు నీతి, ప్రతిపన్నితను, ప్రేక్షకుని బిత్రు సేవాతత్పరునిగాఁ దీర్చి దిద్దుననుటలో సందేహముండదు.

ఈ నాటకములో నాయకుఁడుగా నభివర్ణింపఁబడిన జీమూత వాహనుఁ డొక గొప్ప యీవికాఁడు. అతఁడు శిబికర్ణ ప్రభృతి దానవీరులలో నగ్రశ్రేణికిఁ జెందినవాఁడని చెప్పనచ్చును. అతఁ డాత్రేయునితో నాడిన మాటలను బట్టి పై విషయములు రుజువగు చున్నవి. అతఁడు దానశౌండిమముతోఁ బేదసాదలను దనిపిన దానవీరుఁడని తెలియవచ్చుచున్నది. చిరకాలమునుండియు వంశ పారంపర్యముగా సంప్రాప్తించుచు వచ్చిన కల్పవృక్షమును సైతము పేదవారికి దానముగా నిచ్చెను. ఇత్యాది విషయములను బట్టి యా యొడయనికిఁ బ్రజలపైఁ గల గాఢాభిమానము వ్యక్తమగు చున్నది. బంధువర్గ విషయమున నా వదాన్యోత్తముఁడు పాటించిన విధాన మత్యుత్తమమైనది. బంధువుల నందఱఁ దనయంతటి వారి నిగాఁ జేయుటకై ప్రయత్నించి సఫలీకృత మనోరథుఁడైనాఁడు. ఇఁక నాకెట్టి కొఱతయు లేదని తృప్తిని బ్రకటించినాఁడు. ఇత్యాది సందర్భములలో నభివర్ణితములైన సర్వవిషయములు, సర్వకాలముల యందును, సర్వమానవులు నలవఱచుకొనఁదగిన నైతిక బోధనము లని చెప్పవచ్చును.

రెండవభాగములో నభివర్ణింపఁబడిన జీమూతవాహనుఁడు స్వార్థమును విడిచి పరార్థమునకై పాటుపడిన వ్యక్తి. ఈ ఘట్టమున నీతని పరార్థపరాయణత్వమే ప్రధానముగా గోచరించును. ఇతఁడు దీనులపాలిటి కల్పతరువు. ఇంతటి నిస్పృహాచిత్తుఁడు మఱొకఁడు లేడనిన నతిశయోక్తి కానేరదు. వివాహమైన పది దివసములలోనే నాగకుమారుని రక్షించుటకొఱకై గరుడునికిఁ దన ప్రాణముల నర్పించినాఁడు. ఆత్మబలికి సమయము వచ్చినప్పుడు మాతాపితలు,

భార్య, బంధువులు నేమాదురో యని కూడ నాలోచింపలేదు. పితృసేవకై రాజ్యమును, పరార్థమునకై ప్రాణమును ద్యజించి ప్రపంచ వాఙ్మయములో శాశ్వతమైన స్థానము నాక్రమించుకొని నాఁడు. గరుడునంతటివానికి గుణపాఠమును నేర్పినాఁడు. గౌరీ వరప్రసాదముచేఁ బునర్జీవుఁడై విద్యాధర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైనాఁడు. ఇత్యాది సన్నివేశములలో జీమూతవాహ నుఁడు ప్రదర్శించిన యాత్మత్యాగ మసాధారణమైనది. ఆతని యాత్మత్యాగము కేవలము మానవులనే కాక దేవతలను సైత మాకర్షించినది. ప్రతి పౌరుఁడు పరార్థమునకై పాటుపడవలయు ననెడి నీతి యీ భాగమునందుఁ బ్రతిపాదితమైనది.

మఱియు నీ నాటకమున రెండవభాగమునందు శంఖచూడుఁడు ప్రదర్శించిన స్వామిభక్తి మిక్కిలి విశిష్టమైనది. అతఁడు ప్రాయ మునకుఁ జిన్నవాఁడైనను బ్రతిభావిభవాదులచే మిన్నయని చెప్ప వచ్చును. ప్రభుభక్తి ముందుకు, మాతృభక్తి వెనుకకు లాఁగ దొడఁగిన సందర్భమున, ప్రభునాజ్ఞను నిర్వహించుటయే సమంజస మని నిర్ధరించుకొని, తల్లిని మఱచిపొమ్మని చెప్పినాఁడు. తన ప్రాణమునకు బదులుగా, నాత్మార్పణనిశ్చయమానసుండై, జీమూత వాహనుఁడు ప్రాణముల నర్పించుటకై సంసిద్ధుఁడైనప్పుడు, వలదని నిరాకరించినాఁడు. శంఖధవళమగు శంఖపాలవంశమును శంఖ చూడుఁడు మలినీకరింపఁజాలఁడని హెచ్చరించినాఁడు. ఇత్యాది సన్నివేశములలో శంఖచూడుఁడు ప్రదర్శించిన ప్రభుభక్తత్యుత్త మైనదని చెప్పవచ్చును. మీఁదు మిక్కిలి బోధిసత్త్వుఁడే యనదగిన జీమూతవాహనుఁడు ప్రదర్శించిన ప్రాణదానత్యాగమున కన్నను, నీచజంతుగణమునకుఁ జేరిన శంఖచూడుఁడు ప్రదర్శించిన ప్రాణ దానత్యాగమును, ప్రభుభక్తియు మిక్కిలి విశిష్టతరములని చెప్ప వచ్చును. ప్రతి పౌరుఁడు నట్టి స్వామిభక్తి యలవరచుకొనవలయు ననెడి నీతి యీ భాగమునందుఁ బ్రతిపాదింపఁబడినది.

———

# అర్థతాత్పర్యాదులు

## ప్రథమాంకము

1 ప. నాంది:— "త్రాతవయ్యును ధ్యానవ్యాజంబుచే నెవ్వతెనో మనంబున నిల్పుకొని, మన్మథశరాహతలమైన మమ్ముఁ జూడకుంటివి. నీవు మిక్కిలి నిర్దయాత్ముఁడ" వని యీర్ష్యతో నొప్పిన మారవనితలచే దూషింపఁబడుచున్న బుద్ధజినేంద్రుఁడు మిమ్ము రక్షించునుగాత.

2 ప. ఇంచు విల్లెక్కువెట్టి పొంచియున్న మన్మథునిచేతను, ఫెల్లుగా ఢక్కను మ్రోగించెడు మారవీరులచేతను, భ్రూవిలాసంబులతో ముసిముసి నగవులను బ్రకటించు చలితాత్ములైన సురకాంతలచేతను, నితఁడు చలితుండుగాలేదని, విస్మయంబుతోఁ దిలకించు నింద్రునిచేతను, సిద్ధసాధ్యులచేతను, విస్మితేక్షణములచే వీక్షింపఁబడుచున్న సమాధినిష్ఠాగరిష్ఠుండును, బుద్ధజినేంద్రుండును నైన ముని మమ్ము రక్షించునుగాత. (ఈ రెండు పద్యములయందును బోధివృక్షము క్రింద సమాధినిష్ఠాగరిష్ఠుఁడై యున్న బుద్ధజినేంద్రుని, మారుఁడు నిజసహచరుల సాహాయ్యమున సమాధిభంగము సేయ సమకట్టి విఫలమనోరథుఁడైన బౌద్ధగాథ యనుసంధింపఁబడి యున్నది.)

పై రెండు పద్యములును మూలములో రెండు శ్లోకములుగా నున్నవి. మూలమునందువలెనె యాశీరూపమంగళము ప్రకటితమైనది. (చూడు:- నాందిలక్షణము). అష్టపదనాంది యని చెప్పవచ్చును. సూచ్యార్థము:- "కావ్యార్థసూచనం కైశ్చిన్నాంద్యామేవ నిరూప్యతే" అను వాక్సరణిగ రూపకకర్త మొదటి రెండు శ్లోకములలో సంక్షేపముగా నాటకేతివృత్తమును సూచించినాఁడు. ప్రథమ శ్లోకమునందు బుద్ధజినేంద్రు నుద్దేశించి యొక మందలింపు వ్యక్తమైనది. దేహబంధములను ద్రెంచినవాఁ డగుటచేతను, స్వార్థమునకు లొంగనివాఁ డగుటచేతను, జీమూతవాహనుఁడే బుద్ధజినేంద్రుఁ డని గూఢార్థస్ఫోరకము. కావునఁ బైనుడివిన మందలింపును జీమూతవాహనునకు మూఁడు విధములుగా నన్వయింపవచ్చును. అది కారణముగాఁ గథావస్తువునందలి మూఁడు భాగములు సూచ్యము లగును.

మొదట "మారవనితలు" అను పదమునకు 'రాజ్యశ్రీ' యని యర్థమును జెప్పవచ్చును. నాయకుఁడు రాజ్యశ్రీని యుపేక్షించినాఁడు. అట్లు రాజ్యవిముఖుఁ డైనందులకు విదూషకుఁ డాతనిని మందలించినాఁడు. రాజ్యము

మంతేంగాదిశత్రుబాధితము (అతను బాణాతురమగు నీ జనము.) నాయకుఁడా రాజ్యమునకు రక్షకుఁడు (రక్షకుఁడయ్యె) కాని రాజ్యము నుపేక్షించినాఁడు. కల్పతరువును గూడ ప్రజలకొఱకు దానము చేసినాఁడు. కాని తన ప్రజలనే యిపు డుపేక్షించినాఁడు. అందుచే నాతనిదయ వ్యాజమైనదే కాని, యవ్యాజమైనది కాదు. అతని కఠినహృదయ మసూహ్య మైనది. ఈ విధముగాఁ బ్రజ లాతని యుపేక్షను నిందించిరి. కాని యతఁడు జినుఁడు. ముసలులైన మాతాపితల పరిచర్యార్థము వనవాసజీవనము సేయ సంకల్పించిన యాతని యచంచల దీక్ష నిట్టి విషయము లేవియుఁ గదలింపలేవు. ఈ విధముగాఁ బ్రథమాంక కథ క్లిష్టముగా సూచింపఁబడినది.

రెండవది "మారవనిత" అను పదమునకు మలయవతి యని యర్థమును జెప్పవచ్చును. అట్లు చెప్పినచో ద్వితీయాంక కథ సూచ్య మగును. పరస్పర సౌందర్యాకృష్టమానసులై మలయవతీజీమూతవాహనులు విరహవ్యాకులితులైరి, ద్వితీయాంకమునఁ బునస్సమాగమ మపేక్షించిరి. గౌర్యాలయ పరిసరములలోఁ దపోవనములో నుభయులు కలిసికొనిరి. ఉభయులు నొక పొదరింటినీడ నుండిరి. నాయకుఁడు నాయికను గుర్తింపక యామె చిత్రమును గీయుటలో నిమగ్నుఁడై యుండును. కాని నాయిక యీ విషయమును జాటుగా నుండి చూచి, నాయకుఁడు మఱియొక స్త్రీయందు బద్ధుఁడైనాఁడని భ్రమించినది. పై విషయముల నన్వయించినచో మలయవతి (అతనుబాణాతురజన) యగును. నిజముగా నప్పుడామె విరహిణి యైనది. దుఃఖితయై యీర్ష్యాభావములను బొందును. (ఈర్ష్యాళ్వై) నాయకుఁడామె నూరడింప శక్తుఁడయ్యును దయారహితుఁ డయ్యెను. గౌర్యాలయమునఁ దమ ప్రథమ సమాగమమునందు నాయకుఁడు చూపిన ప్రణయ మంతయు మిథ్య. మిత్రావసువు ప్రార్థనను నిరాకరించుటతో నాతని నిర్దయ పరాకాష్ఠను బొందినది. కావున నతనికంటె నిర్దయుఁడు (మిథ్యాకారుణికుఁడు) మఱియొకఁడుండఁడు. నాయిక పైవిధముగా జీమూతవాహనుని ప్రేమ నపార్థము చేసికొనినను, అతఁడు నిజముగా మలయవతియందుఁ బవిత్రమైన ప్రేమను గల్గియుండెను. మిత్రావసువు చెల్లెలుతప్ప మఱియొక స్త్రీ యాతని హృదయమును జూఱఁగొన్న దనినది మిథ్యయే యగును. (మిథ్య) ఈ మిథ్యా భావమువలన నాతఁడు తన ప్రణయినికే నిర్దయుఁడై నిర్దయాభావమునం దసమానుఁ డయ్యెను. కాని త్వరలోనే బుద్ధుఁడైనాఁడు. (బుద్ధుఁడు). తన ప్రణయిని ప్రమాదావస్థలో నుండఁగాఁ దటాలున వచ్చి రక్షించినాఁడు. తర్వాత మిత్రావసువు ప్రార్థన యంగీకరింపఁబడినది. మలయవతీ జీమూతవాహనుల వివాహము వైభవోపేతముగా జరిగిపోయినది. ఇట్లు తృతీయాంక కథలోఁ గొంతభాగము గూడ నీ సందర్భమున సూచితమైనది.

మూఁడవ విషయము:— ఆ మందలింపు నాయకుని తలిదండ్రులచేఁ జేయఁ బడినట్లుగా గ్రహింపవచ్చును. నాయకుఁడు మరణావస్థలో నున్నప్పు డాతని తలిదండ్రు లచ్చటికి వచ్చిరి. అతఁడు నిమీలితలోచనుఁడై ధ్యాననిష్ఠలో నున్నట్లు వారు గుర్తించి,

"తమవాఁడన్యుఁ డటన్న భేదము కృపన్ దాలేమి సత్యమ్మ చి
త్తమునన్ "రక్ష్యులు పల్వురా? ఒకఁడ?" యింతన్ దోఁచదో ఒక్క స
ర్పము రక్షింపఁగ జీవితార్పణ మొనర్పం బూను నీచేత వం
శము సర్వంబును, మేము, నీవు సతి నాశంబంద నయ్యెం గదా!

"ఒక్క ప్రాణిని రక్షింపఁబూని, యొకవంశమునే యంతరింపఁజేసెదవా! నీకంటె కఠినహృదయుఁడు మఱొకఁ డుండునా" యని మందలించినారు. అట్లు తలిదండ్రులచే మందలింపఁబడిన జీమూతవాహనుఁడు మిథ్యాకారుణికుఁడై తన వారిని దుఃఖసముద్రమున ముంచినను నిజముగా నాతఁడు బుద్ధజినేంద్రుఁడు. శారీరకబాధలను, శత్రువులను, చివరకు మరణమును గూడ జయించి, తలిదండ్రులకు, బంధువులకు, భార్యకు మోదమును గూర్చినాఁడు. ఈ విధముగా నీ మొదటి పద్యమునఁ బంచమాంక కథగూడ సూచితమైనది.

రెండవ పద్యమునందుఁ జతుర్థ పంచమాంకముల కథలోని ముఖ్యవిషయమైన శంఖచూడుని వృత్తాంతము సూచింపఁబడినది. చివరి పాదములోని "ముని" యను పద మాత్మత్యాగముతో సర్పమునకు విమోచనము గలిగింపవలయు నన్న దృఢసంకల్పము కలిగిన జీమూతవాహనునికే వర్తించును. నిజముగా నాతఁ డున్నతాశయములు గలిగిన మునీశుఁడే. అతఁడు బోధిసత్త్వుఁడు. ప్రాపంచిక బంధము లాతనిని వ్యామోహితునిఁ జేయఁజాలవు. (యోగాసనస్థుఁడై) యను పదము 'వధ్యశిలాతలమున' కనువర్తించును. నాయకుఁడు వధ్యశిలపై నుండియు యోగపీఠము నధిష్ఠించిన ట్లున్నాఁడు. 'రక్తాంశుకయుగళ' మనఁబడు వివాహ వస్త్రములను ధరించి, శంఖచూడునికి బదులు తాను గరుడుని కాహారమగుటకుఁ గుతూహలుఁడై, ప్రాణము లర్పించుటకు సంకల్పించినాఁడు. ఈ సందర్భమునఁ దనకు మలయవతిపైఁ గల ప్రేమగాని, మాతాపితలయెడఁ గల భక్తిగాని, విద్యాధరసార్వభౌమ పదవీవ్యామోహముగాని, యాతనిని (చలితుండు గాఁడు) కదలింపలేవు. "ఆ కృష్టచాపుఁడౌ నతనునిచేత" అను సమాసమువలన మలయవతీ ప్రణయము గూడ నాతని దృఢనిశ్చయమును మార్చలేదని ద్యోతకము గాక పోదు. "ఆకృష్టచాపుఁడౌ నతనుచేత ......... హతపటుపటహావల్గిత మార వీరులచేత" ఇత్యాదివాక్యములను బట్టి మలయవతి సోదరుఁడైన మిత్రావసువు వృత్తాంతము సూచ్య మగుచున్నది. మతంగుఁడు విద్యాధర సామ్రాజ్యముపై

దండెత్తి యాక్రమించుకొనినాఁడన్న వార్తను విన్న మిత్రావసువు మిక్కిలి కోపసంరంభముతో జీమూతవాహనుని దగ్గఱకు వచ్చి, యా వార్త నెఱిఁగించినాఁడు. జీమూతవాహనుని యాజ్ఞకొఱకై యతఁ డచ్చటకు వచ్చినాఁడేకాని, బలపరాక్రమ సమన్వితుఁడైన మిత్రావసువు, సిద్ధసైనికులు నా మతంగహతకుని హతమార్చి యుండెడివారు. అట్లు రాజ్యము మతంగాధీన మైనదని చెప్పినప్పటికిని నాయకుఁడు చలింపక, కోపోద్రేకుఁడై వచ్చిన మిత్రావసువుని శాంతోన్ముఖుని గావించుటకై ప్రయత్నము చేసినాఁడు. యుద్ధము వలదని నివారించి నివృత్తిని బ్రకటించినాఁడు. మూఁడవ యంకములో సక్షేపర్ణింపఁబడిన యీ విషయ మీ సందర్భమున సూచ్యమైనది.

"భ్రూకుటీభంగప్రకంపజృంభస్మితాల సదృశలైన దివ్యలలనా జనమ్మచే ........." ఈ సమాసములను రెండు విధములుగా సమన్వయింపవచ్చును. మొదటిది:— శంఖచూడుని తల్లిపరముగా సమన్వయించినచో, నాగమాత "హా పుత్రకా, శంఖచూడా, నాగలోకసంరక్షకుఁ డైన వాసుకియే పరిత్యజించి నప్పుడు నిన్ను వేరెవ్వరు రక్షింపఁగలరని యూరడిల్లుదు" నని పరిదేవనము గావించుచు వధ్యశిలను సమీపించినది. అంతలో "నేనమ్మా నే" నని జీమూతవాహనుఁ డచ్చటికి వచ్చినప్పుడు తన పుత్రుని జంపుటకు గరుడుఁడే యచ్చటికి వచ్చినాఁడని భ్రాంతిపడి, భ్రూకుటీభంగము గావించి ప్రకంపిత యైనది. అతఁడు తన పుత్రుని రక్షింపవచ్చిన విద్యాధరుఁ డని తెలిసికొనినప్పుడు మిక్కిలి సంతోషమును బ్రకటించినది. రెండవది:— (దివ్యలలనా) గౌరీదేవికి సమన్వయింపవచ్చును. నాయకుఁడు మరణించినపిమ్మట మలయవతి "భగవతీ, గౌరీ, విద్యాధర చక్రవర్తి నీకు భర్తకాఁగలఁడని వరమిచ్చితివి. మందభాగ్యురాల నగు నా మూలమున నీవు మిథ్యావచన వైతివి గదా" యని మిక్కిలి వాపోయిన సందర్భమున నాదేవి వెంటనే ప్రత్యక్షమై నాయకుని బ్రదికించి, విద్యాధర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుని గావించినది.

"ప్రహ్వాశీర్షులచే" ఈ సమాసమును గూడ రెండు విధములుగా సమన్వయింపవచ్చును. మొదటిది:— గరుత్మంతుఁ డమృతవర్షమును గురిపించినప్పుడు చిరకాల శల్యావశేషములైన యాశీవిషము లన్నియుఁ బునర్జీవములు గలవై వక్రగతితో శిరములు వంచి జీమూతవాహనుని గీర్తిప్రశస్తులను వేనోళ్లఁ గొనియాడుచుఁ బాతాళమున కేఁగినవి. రెండవది:— చిరకాలవిరోధులైన మతంగదేవ ప్రభృతులగు విద్యాధరపతులు జీమూతవాహనుని జేరి శిరములువంచి నమస్కరించిరి.

"పులకితాంగుఁ డగు నింద్రునిచే ......... వీక్షింపఁబడిన" ఈ సమాసములచే నింద్రాదిదేవత లాశ్చర్యచకితులై పులకితాంగులై జీమూతవాహనుని ప్రాణత్యాగమును వీక్షించిరి. తన శరీరములోని మాంసమును భక్షించు సందర్భమున నెట్టి బాధను బ్రకటింపని జీమూతవాహనుని గరుడుఁడు భక్షించుటను మాని వేసి యాశ్చర్యచకితుఁడై తిలకించుచుండెను.

5 ప ప్రస్తావన:— "మాతాపితలకుఁ బరిచర్య సేయు నిమిత్తమై, సర్వసామ్రాజ్య సుఖములను త్యజించి వనమున కేఁగుచున్న జీమూతవాహనుని బోలె నేనును నా తలిదండ్రులకు సేవజేయుటకై యరణ్యమునకుఁ బోయెద" నని రెండవ సూత్రధారుఁడు (ప్రస్తావనా ప్రవర్తకుఁడు) నటితోఁ జెప్పి నిష్క్రామించినాఁడు. ఇది ప్రస్తావనాభేదములలోఁ బ్రయోగాతిశయమునకు సరియైన యుదాహరణము. ప్రయోగాతిశయము:— ఒక ప్రయోగమునందు వేఱొక ప్రయోగమును దలకొల్పినచో నది ప్రయోగాతిశయ మనఁబడును. ఇచ్చట రెండవ సూత్రధారుఁడు పితృసేవాపరిచర్యార్థమై వనమునకుఁ బోవుచున్న జీమూతవాహనునియొక్క ప్రవేశమును సూచించి, నిష్క్రాంతుఁడై, తన ప్రయోగము నతిశయించునదే యగు ప్రయోగమును సూచించినాఁడు.

6 ప:— రాగమూలను = రాగమరిషడ్వర్గములలో నొకటి; మోహము; (మోహమరిషడ్వర్గములలో నొకటియై కార్యాకార్యమన్న జ్ఞానమును బోఁగొట్టి మానవుని యింద్రియలోలునిగాఁ గావింపఁగలుగును. "రాగమూలమైన పరువము మిక్కిలి నింద్యమయ్యెను, నాకుఁ దలిదండ్రులకుఁ బరిచర్య సల్పుటయందు మిక్కిలి సహకరించుచున్న" దని జీమూతవాహనుఁ డాత్రేయునితోఁ జెప్పినాఁడు).

7 ప:— తాత + భుక్త + ఉజ్ఝిత + అన్న + సంజాత + తృప్తి = జనకునకుఁ గావలసిన యాహార మాయన యనుభవించిన పిమ్మట మిలిగినదానిని యనుభవించుటచేతఁ గల్గు తృప్తియని భావము; త్రైలోక్యభోగకలన = మూఁడు లోకములయొక్క యాధిపత్యము గల్గినప్పటికిని; త్యక్తగురునకు = తల్లిదండ్రులను విసర్జించినవానికి (పెద్దలను త్యజించి చరించువానికి).

8 ప;— వ్యాపృతులు + ఐరి = వ్యాపారము నొందినవారైరి; ఆత్మసమతంగనె బంధుత = బంధువులు తనయంతటివారైరి; సురద్రువు = కల్పవృక్షము; కరణీయము = చేయఁదగిన విషయము.

9 ప;— ప్రమద + అనేకప + గండభిత్తికషణాభగ్నస్రవచ్ఛందనద్రుమమః = మదపుటేనుఁగులయొక్క చెక్కిళ్ళ రాపిడిచే రసస్ఖలనముఁ జెందు చందనవృక్షములతో నొప్పినది; సముద్రతరంగములయొక్క తాకుడుచేతఁ గల్గిన

ప్రతిధ్వనులతో నిండిన పెన్గుహలతో నొప్పినదియు; సిద్ధజాతిస్త్రీల పాదముల పారాణిచే నెరుపెక్కిన శిలాతలములు గలదియు; (ఈ పద్యమునందు, "శిశువును మోటరు లెవ్వరైనను చెక్కిలిని గీటగా, నా శిశువు కన్నీళ్ళు కార్చును. మఱెవ రైనను ముద్దునకుఁ జేతితోఁ గొట్టగా నోరుతెఱచి యేడ్చును. అంతట నా శిశు వచ్చటఁ దిరుగాడుచున్న తల్లి, యక్క మొదలయినవారి కాళ్ళదగ్గఱకుఁ బ్రాకు లాడుచు పోవును. వారి పనిమీఁద వారా బిడ్డను జూడక గృహములో నటు నిటు దిరుగుచుండఁగా వారి కాలిపారాణి యంటుకొనుటచే నెఱ్ఱనైన లావణ్య మయాంగములతో నా శిశువెట్లుండునో యట్లు మలయగిరి యున్న" దని విశేష భావము వర్ణింపబడియున్నది.

10 ప:— తా॥ జీమూతవాహనునకు దక్షిణనేత్ర మదరుచుండెను. ఆతని మనస్సునందెట్టి కోరికయు లేదు. కాని దక్షిణనేత్ర మదరినచో వెంటనే శుభ ప్రదమయిన ఫలమాసన్నమగునని యార్షవచనము ఘోషించుచున్నది. ఆ విష యమునే యాతఁడాత్రేయునితో, జెప్పుచున్నాఁడు.

11 ప:— జరత్కమండలులు = పగిలిపోయిన కమండలువులు; నిర్మల వారి = తేటనీరు; మేఖలలు = మొలత్రాళ్ళు; మౌంజులు = ముంజిగడ్డి (ముంజి గడ్డితో పేనిన మొలత్రాళ్ళు) వటుకత్రుటిత + ఉజ్ఝితములు = పుర (?)గాడి పోగా బ్రహ్మచారులు త్రెంచిపోసిన మొలత్రాళ్ళు; సామపదంబు = సామ గానము.

12 ప:— తా॥ అత్యుతమధురమైన యళినాదములతో స్వాగతమిచ్చి నట్లును, మిక్కిలి పండ్ల బరువుచే వంగిన యగ్రములతో నమస్కరించినట్లును, సుమవృష్టిచే నర్ఘ్య మొసంగినట్లును నొప్పియున్న వృక్షము లతిథి సపర్యల నొనర్చుటను నేర్చుకొన్నవా యన్నట్లున్నవి.

13 ప:— స్థానసంప్రాప్తిన్ + తారమంద్రవ్యవస్థలమరన్ = సమస్వరము, రము, ఉచ్చైస్స్వరము, అధఃస్వరము నను మూఁడు భేదములతో నొప్పి; అళిరుతులు = తుమ్మెదనాదములు; మేళవింపఁగన్ = జతగూడియుండగా; వల్లకీగీతి=వీణాగానము (విపంచీస్వరము); దంత + అంతరాళసక్తతృణకబళచ్ఛేద శబ్దమణచి = దంతములమధ్య నున్నఘాసకబళచర్వణమును మానుకొని; కురంగ ములు = లేళ్లు (సమస్వరము, నుచ్చైస్స్వరము, నధఃస్వరమునను భేదములను స్పష్టముగాఁ బ్రకటించునట్టి మలయవతి గానము, వీణానాదముతోను, తుమ్మెద గానముతోను మేళవింపఁబడి, యాలపింపఁబడుచుండగా నములుచున్న దర్భకబళ ములు దంతములమధ్యనే యుండిపోగా, లేళ్లు చెవుల నిక్కఁబొడుచుకొని విను చున్నవని భావము).

14 ప:— పరిఫుల్లకమలకేసరపరాగపరిపాండురప్రభా = మిక్కిలి వికసించిన కమలములోని పుప్పొడి కరణి గౌరవర్ణప్రభతోనొప్పు గౌరీయని సంబోధనము (గౌరీ నీ యనుగ్రహ భాగ్యముచే శీఘ్రముగా నా వాంఛితము నెరవేరునట్లు చేయుమని మలయవతి గౌరిని గూర్చి ప్రార్థించినది).

15 ప:— దశవిధవ్యంజనధాతువుల్ = గానమునకు స్పష్టతను గలుగఁజేయు దశవిధధాతువులు (సంగీతశాస్త్ర పారిభాషిక పదములు) వ్యక్తి = విస్పష్టత; ద్రుతము, మధ్యము, విలంబితము = వడిగా నడచునట్టి లయ, మధ్యలయ, చౌకపు లయ (నృత్యగీతవాద్యములయం దనుసరించెడు తౌర్యత్రికసామ్యమైన లయ విశేషములు. ఇవి ముమ్విధములు); యతులు = తాళప్రాణ కళా విశేషములు; నిలుపుదలలు; (ఇవి ముమ్విధములు. అక్షరకాలమును బట్టి యతిని పాటింపవలయును); తత్త్వౌఘుమ్ము = విలంబితమను వాద్యప్రకార విశేషము.

16 ప:— దివ్య + అంగన = స్వర్గసుందరి; గంధర్వాంగన; చక్షుసహస్రమ్ము = వేయి కన్నులు.

17 ప:—శ్వసితకంపితపీవరస్తనీ = నిట్టూర్పులచేత వణఁకుచుఁ గిక్కిరిసియున్న దిట్టమైన స్తనములు గల దానా యని సంబోధనము; విశాలతరళలోచన = విశాలమైన చలించునట్టి నేత్రములు గల దాన; సంభ్రమము = తొట్రుపాటు; వేధింతువు + ఏల = ఆయాసపెట్టెద వేల.

18 ప:— ఉష్ణీషము = కిరీటము (తలపాగయు నని యర్థాంతరము); భ్రూమధ్యమందు + ఊర్ణ = కనుబొమ్మల మధ్య నుండు సుడికి ఊర్ణయని పేరు (ఇది మహాపురుషలక్షణము).

19 ప:— గురుజఘనభారమున మంథరసుందరయాన యగుచుకా = మిక్కిలి జఘనభారముచే నలసమైనట్టిదియు నందమైనట్టిదియు నగు గమనము గలిగినట్టిదై.

21 ప:- తత్క్షణ ఘృష్టపటీరసారచర్చాపరిపాండుగండమయి = మిక్కిలి యొరపిడిచే స్రవించుచున్న చందనపుఁ బాలయొక్క ధారచేతఁ దెల్లనైన కపోలములు గలదియై; సక్తనిజశ్రవణతాలవృంతరేఖాపవమానవీజితముఖమ్మై = చెవులనెడి విసనకఱ్ఱలయొక్క గాలి చేత నంతటను వీవఁబడుచున్న ముఖము గలది. స్వీయకర + ఉజ్ఝిత + అంబు + ధారాపరిషిక్తవక్షమయి = తనయొక్క తొండము చేత విడువఁబడిన నీటిధారలచేఁ జల్లఁబడిన వక్షముగలదై; శోషితసల్లకస్థితికా = వాడిపోవుచున్న అందుగుచెట్టు విధముగా; రాజిలుకా = ప్రకాశించును.

## ద్వితీయాంకము

1. ప:— తా॥ చందనలతాపల్లవ సంసర్గముచే మిక్కిలి శీతలమైన యీ కదళీమారుతమును నిట్టూర్పులచే నీవే వేఁడిని గలిగించుచున్నావని చతురిక మలయవతితో నన్నది.

2 ప:— వలిత + ఆలోక + సిత + అసిత + ద్యుతిన్ = చలించునట్టివియుఁ దెల్లనివియు నల్లనివియునగు నేత్ర కాంతులచే; తా॥ ప్రసరింపఁబడిన సితాసిత నేత్ర దీధితులచే వ్యాప్తములైన యాశ్రమ వృక్షములు విటపావసక్తనృగాజనములాయనునట్లా ముగ్ధాక్షి మాని కట్టెదుటనే నన్నుఁ జూపుఁదూపులతో నేసినది. అట్లయ్యును నీవు వ్యర్థముగాఁ బుష్పబాణములచే నన్ను మఱలఁగొట్టుచున్నావు. ఆ పుష్పబాణము లిప్పట్టున వమ్ములౌనుగదా యని భావము.

3 ప:— ఘనచాంద్రీసితయామినుల్ = ఘనమైన వెన్నెలచేతఁ దెల్లనైన రాత్రులను (తెల్లని రాత్రులు); ఘ్రాణింపనో కల్వన్ = కలువయొక్క పరిమళమును వాసనచూడలేదో ?; సైపనో యున్మీలిత మాధవీసురభిళప్రాదోషవాతాహతుల్ = రాత్రి తొలిజామునందు బాగుగా వికసించిన మాలతీ ప్రసూనముల సువాసనతో నేతెంచు గాలిని సహింపలేదే ? కమలాకరంబులచెంతఁ గల మధుపంబుల ధ్వనులను వినలేదో ?

5 ప:— ఇందుమణిమయమ్ము + అయ్యున్ = చంద్రకాంతమణులతో నిండినదయ్యు.

8 ప:— అక్లిష్టబింబశోభాధరము = పరిపూర్ణమైన మండలము యొక్క కాంతిని ధరించినది (చంద్రరేఖాపరమయినయర్థము) పండిన దొండపండు కాంతితో నిండిన యధరోష్ఠము గలది. (ముఖపరమయిన యర్థము).

10 ప.— ఘనవిద్యాధరరాజవంశమణి = వంశ = వంశమను వెదురు యొక్క.........మణి = ముత్యమయినవాఁడు; సాహసధనుండు = సాహసమే ధనముగాఁ గలవాఁడు; రూప + అనుపముఁడు = రూపమునందు సాటిలేనివాఁడు.

11 ప:— వేగిరము + పాటు = వేగిరంపాటు = తొందరపాటు (సాహసము); ముగ్ధ = క్రొత్తగా నంకురించుచున్న యౌవనము గలదియు, రతియందుఁ బ్రతికూలయు, విశేషముగా లజ్జించునదియు నగు నాయిక ముగ్ధ (ముగ్ధాయని నాయకుఁడు మలయవతిని సంబోధించినాఁడు); కరకిసలయము = చిగురుఁగేలు, హస్తపల్లవము.

12 ప:— తా॥ "హారలతలు ధరించుట కర్హ మైన నీ కంఠమునందుఁ బాశము నే హస్తముం చెనో యట్టి సాపరాధ మైన హస్తముతో నీ చేతులను బట్టు కొంటిని. నేను విడిచిపెట్ట" నని జీమూతవాహనుఁడు మలయవతి హస్తములను బట్టుకొనెను.

13 ప:— పిష్టాతకవృష్టి = పటవాసవృష్టి (బుక్కావర్షముచేత); మేరు రుచిసంధానించిగంధాద్రి = అంతటను బుక్కా చల్లుటచే మలయపర్వత మంతయు బంగారమువలె నుండెనని భావము (మలయాద్రి మేరుసమానమై యుండెనని భావము); వల్గితనూపురానురణితోద్గీతమ్మ్రులక్ = వేగముగా మ్రోఁగెడు నందియలఁ నాదముతో నొప్పిన గీతములతో (పాదకటకముల ధ్వనితో గూడిన సిద్ధాంగనా గానములని భావము).

## తృతీయాంకము

4 ప:— నవ + ఊఢ = పెండ్లికూఁతురు (క్రొత్తగా వివాహమైన స్త్రీ); పరిష్వంగము = కౌఁగిలి.

తా॥ ఆమె వైపు చూచినచోఁ జూపును గ్రిందికి వాల్చును. పల్కరించి నచో బదులు పలుకదు. పానుపునందుఁ బరాఙ్ముఖియై పరుండును. కౌఁగిలించి నచో వణకుచుండును. చెలులు వెడలినచోఁ దానును బోవుటకు సిద్ధపడును. అట్లయ్యును నీ నవోఢ నన్ను మిక్కిలి యలరించుచున్నదని భావము.

5 ప:— దావ + అనలదీప్తశీతకిరణ + ఆతపత ప్తమొనర్చి = దావానల తుల్యమైన వెన్నెల వేడిమిచేఁ దపింపఁజేసి; అహర్నిశలు = పవలును, రాత్రి యును.

తా॥ నీవు మానమువహించి, హుంకృతిమాత్రమున మాట్లాడుచు, నా దేహ మును దావానలతుల్యమైన వెన్నెలచే దహింపఁజేసితివి. పవల్నిసి నిన్నే మనం బున నిడుకొని నేను తపంబు గావింపఁగా, నా ఫలసిద్ధి సార్థకమౌనటు నీ ముఖార విందమును జూడఁగంటిని (పంచాగ్ని మధ్యమునఁ దపమును సాగించుట యిందు సూచితము).

6 ప:— వ్రేఁగు = భారము; నితంబభారము = పిఱుఁదులబరువు; కాంచి = మొలనూలు; ఊరుయుగము = తొడలజంట.

తా॥ స్తనభారము మాత్రమున నడుము నసియాడుచుండ హారము లెందులకు? తొడలు పిఱుదుల బరువును భరింపలేక తూలుచుండఁగా మొల నూలెందులకు? అడుగులూరు భారముచే నల్లాడుచుండఁగా నందియ లెందులకు? కావున రమణీయములైన నీ యంగకములే నీ కలంకారములై యుండఁగా లౌకికాలంకారము లన్నియు వ్రేఁగగును గదా యని భావము.

7 ప:— శైత్యములు = చలువఁజేయఁబడినవి; కుట్టిమములు = లౌతికట్టడపు నేలలు; నీలకంఠస్వామి = నెమలి; పరాగము = పుప్పొడి.

తా॥ ఈ లతామంటపము ప్రవహించిన చందనపుఁ బాలచేఁ జలువజేయఁబడిన కుట్టిమములు గలది. ఇచ్చట ధారాజలయంత్రగృహోధ్వని మేఘగర్జితమని భ్రమించి నెమళ్లు నాట్యముసేయుచున్నవి. చెట్లనుండి రాలుచున్న పుష్పపరాగముచేఁ గప్పఁబడిన జలధారలు చెట్లపాదులను నింపుచున్నవని భావము.

8 ప:— పూవుటీరములు = పూలమంటపములు; ముఖరిత = ప్రయోగింపఁబడిన; పటవాసక్రీడ = బుక్కావిలాసము; షట్పద ప్రవరంబుల్ = శ్రేష్ఠమైన తుమ్మెదలు.

తా. తమ గీతనాదములచేఁ బూలమంటపములు ప్రతిధ్వనించునట్లు పాడుచుఁ బుప్పొడిలో మునిఁగి, బుక్కావిలాసముల ననుభవించుచుఁ, బ్రియాంగనలఁ గూడి పూఁదేనియలఁ గ్రోలుచుఁ దుమ్మెదలు పానమహోత్సవమును జరుపుకొనుచున్నవని భావము.

9 ప: - సంతానస్రజంబుల్ = కల్పవృక్షముయొక్క పూలదండలు; మణిభూషారుచికర్బురాచ్ఛపట సంభారమ్ము = రత్నభూషణముల కాంతిచేఁ జిత్రవర్ణము గలిగిన నవాంశుకములు; ప్రియాపీతా + అవశిష్ట + ఆసవంబు = దయితలు చవిచూడగా మిగిలిన మద్యము.

తా. శరీరమునకుఁ జందనగంధ మలఁదికొని, కల్పవృక్షముయొక్క పూలదండలను మెడలందు వేసికొని, విద్యాధరులు, సిద్ధులు చందనవృక్షముల నీడలయందు గుమిగూడి దయితలు త్రాగఁగా మిగిలిన మద్యమును త్రావుచున్నారు చూచితివా యని భావము.

10 ప: తా. మలయవతి మోముదామరము చెక్కిళ్ల స్వచ్ఛమైన కాంతిచే మొట్టమొదటఁ జంద్రుని జయించి, తర్వాతఁ దాపానురక్తితోఁ బద్మములను జయించుటకుఁ బూనుకొన్నదని భావము.

11 ప:- నందనము = నందనోద్యానము (రెండవయర్థము: సంతోష పెట్టునది); అన్యము = (నందనమని ప్రసిద్ధికెక్కిన యింద్రోద్యాన మిచట నితరమైనది); కేవల మ్మరణ్యమ్మ యగును = నందనమును గాదు-ఉద్యానమును గాదని భావము.

తా. కనుబొమ లనెడి తీఁగలచేఁ గొమరు మిగిలి, ఎఱ్ఱని పెదవు లనెడి చివుళ్లచే మిక్కిలి ప్రకాశించుచు నీ ముఖారవిందము నందనోద్యానమే యగు చున్నదని భావము.

12 ప:- మందహాసకుసుమ + ఉద్గమమ్ము = చిఱునవ్వనెడు పువ్వుయొక్క యుత్పత్తి; అధరపల్లవమునందు = క్రిందిపెదవి యనెడు చిగురునందు.

తా. నీ చిఱునవ్వనెడు పువ్వుయొక్క యుత్పత్తి యధరపల్లవమునందు ఫలరూపమును బొంది కన్పించుచున్నది. అట్టి చిఱునవ్వును దిలకించుటచే నా కన్నుదోయి కృతార్థ మాయెనని నాయకుఁడు నుడువుచున్నాఁడు.

13 ప: - భానుకర + అత్యామృష్టమయి = సూర్యకిరణముల కాకచే మిక్కిలి కందిపోయి; పాటలకాంతి = ఎఱ్ఱనికాంతి (ఎఱ్ఱఁబాఱి); దంతసంతానరుచి = దంతసమూహముల కాంతి; కేసరములు = కింజల్కములు.

తా. సూర్యకిరణముల కాకచే మిక్కిలి కంది యెఱ్ఱఁబాఱి, దంతము లనెడు కింజల్కములు కలిగినదై, నీ ముఖము నిక్కముగాఁ బద్మమని తోఁచు చున్నది. కాని మధుపములు మాత్రము మధువును గ్రోలుటలేదని భావము.

15 ప:- అర్కప్రభక్ = సూర్యుని తేజస్సును; వాసరంబునకుఁ బ్రావృట్కాళిమక్ + కొల్పి = వర్షాకాలమ్మునఁబోలె వాసరంబును మలినము గావించి; ఆహవము = యుద్ధము.

తా॥ మా సిద్ధసైన్యములు సూర్యరశ్మి యగపడక ముసురుపట్టిన దినమో యను భ్రమగొల్పు నట్లాకాశమార్గముల నన్నింటిని యాక్రమింపఁగల విమాన ములలో యుద్ధముఁ జేయుటకు సంసిద్ధులై మిక్కిలి యుత్సహించుచున్నారు. వారి నందఱను నడిపించుటకు నీ యాజ్ఞ యవసరమై యున్నది. అట్లు మేము దండెత్తినచో నీ శత్రువులందఱు నశించుట నిక్కువము. వారు మఱల నిన్నే కొలుతురు. నీ రాజ్యము నీకు దక్కునని మిత్రావసువు జీమూతవాహనుని హెచ్చరించినాఁడు.

16 ప:- రభస + అవకృష్ట + చంద్రహాసరోచిస్సటా-భారభాసురుఁడునయి = వెంటనే యొరనుండి దూయఁబడిన కత్తియొక్క కిరణసమూహములచేఁ

ప్రకాశించునట్టివాఁడనయి; అద్రిపతితహరి=కొండనుండి దుముకుచున్న సింహము; మతంగజరాజమ్ము = ఇభశ్రేష్ఠము; హంతకుని = హంతకుఁడైనవానిని (ఇదియొక తిట్టు, చచ్చినవాఁడు)

తా. ఒరనుండి దూయఁబడిన కత్తియొక్క కిరణసమూహములచేఁ బ్రకాశించునట్టివాఁడనై, యద్రినుండి దుముకుచు, మతంగజమును హరి దునుము నట్లు మతంగ హంతకుని వధియింతును.

18 ప: తా. నీరజకోరకములను నిత్యము వికసింపఁజేసి మధుపములకు హితమును గూర్చుచు, నిజకిరణ దీధితులచే ముజ్జగములను బ్రకాశింపఁజేయుచు, సిద్ధగణవందితుఁ డగుచు మిక్కిలి ప్రయాసముతోఁ బరార్థసిద్ధికై పశ్చిమాద్రి కేఁగుచున్న సూర్యభగవానుఁడు మిక్కిలి శ్లాఘ్యుఁడని భావము.

## చతుర్థాంకము

1 ప:— అంతఃపుర వ్యవస్థ = అంతఃపుర స్త్రీలయొక్క యేర్పాటులను, రాజభార్యలయొక్క యేర్పాటులను (పట్టణములలోపలఁ జేయఁదగు కట్టు దిట్టము లనియు నర్థాంతరము); అనుపదమును=ప్రతిపదమునను, అడుగడుగునను (కాలెత్తి యడుగు పెట్టినప్పుడెల్ల ఉద్యోగస్థులయొక్క యన్ని యధికారముల యందును); స్ఖలితములన్ = జాఱుపాట్లను (లంచములు పుచ్చుకొనుట రాజద్రవ్య మపహరించుట మొదలయిన దోషములతోఁ గూడిన జాఱుపాట్లు); దండనీతి = చేతికఱ్ఱయొక్క తోడ్పాటును (నేరము చేసినవారిని దండించు నట్టి చట్టమును); వృద్ధత కతాన = ముదిమి దాపురించుటచేత; నృపవృత్తము = రాజచర్య.

2 ప:— శాద్వలస్థలము = పచ్చికబీడు; స్వచ్ఛోపలమ్ము = స్వచ్ఛ+ఉప లమ్ము = స్వచ్ఛమైన ఱాళ్లుపరచిన నేలలు; నైర్ఝరజలము = సెలయేళ్ల నీరు.

తా. పచ్చికబీళ్లు పడకలుగాను, ఱాతినేల లాసనములుగాను, చెట్లనీడలు నివాసగృహములుగాను, సెలయేటి నీళ్లు పానజలంబుగాను, కందమూలాదులు భోజనంబులుగాను, మృగములే హితజనంబులుగాను, నీ యడవిలోఁ బ్రయత్నము లేకయే లభించినవి. అట్టి స్వభావసిద్ధ వైభవముల కునికిపట్టైన యీ యడవి పరుల ప్రయోజనముయొక్క యభావమువలని దుఃఖముచే మిక్కిలి పీడింపఁబడు చున్నదని భావము.

3 ప. తా. నీటియేనుఁగులు పైకెగిరి యాస్ఫాలనము గావింపఁగా నుత్పన్న మైన ధ్వని మలయగిరి గుహాముఖములందు వ్యాపించి ప్రతిధ్వనుల నీనుచుండెను. అట్టిధ్వని మిక్కిలి గంభీరమై, చెవులకుఁ జెవుడు గల్పించునంతటి హెచ్చుగా నుండఁగా, లెక్కలేని శంఖములచేతఁ దెల్లనైన సముద్రవేలను నాయకుఁడు వర్ణించుచున్నాఁడు.

4 ప:— కరిమకర నికరము = ఏనుఁగులయొక్కయు మొసళ్లయొక్కయు సమూహము; భాసించుచుండెన్ = ప్రకాశించుచుండెను.

తా. ఏనుఁగులు, మొసళ్లు లవంగపుఁ జిగుళ్లను నమలి యుమియఁగాఁ బరిమళించు నీటితో నొప్పి, రత్నసంతానదీప్తులచే మిక్కిలి ప్రకాశించుచు, నీ సముద్రవేల మిక్కిలి మనోహరముగా నున్నదని భావము.

8 ప:— పుట్టువుగన్నవానిని = జన్మమెత్తినవానిని; ధాత్రి = దాది.

తా. పుట్టిన బిడ్డను మొదట ననిత్యతయే దాదివలె ఱొమ్మున నిడుకొని లాలించును. పిమ్మటనే సాధారణముగాఁ దల్లి లాలించుచుండును. కావున నీ సందర్భమున దుఃఖింపవలసిన యవసరము లేదని శంఖచూడుఁడు తల్లినోదార్చుచు చెప్పినాఁడు.

18 ప:— చటుల = చలించుచున్న, త్రోటిపుట+అగ్ర+పాటన+రయ స్కన్న+అల్ప+మాంస+అశన+ఉత్కట+సంవర్ధిత + గర్ధ + గృధ్రపటలీ ద్రాక్పతబద్ధ + అంధ్యముక్ = దొన్నెలవంటి ముక్కులనుండి జాఱిపడిన మాంసాహారమును రుచిచూచుటయం దాసక్తి గల్గిన గద్దల సమూహముయొక్క ఱెక్కల జోడులచేఁ గప్పఁబడిన చీకటి గలదియు.

తా. ముక్కులనుండి జాఱిపడిన మాంసపుముక్కలను మఱల గ్రసించు నాశతో ఱెక్కలార్చుచు నల్దిక్కులఁ దిరుగాడుచుండుటచేఁ జీకట్లు గ్రమ్ము నదియు, మెదళ్లు మిశ్రితమై ప్రవహించుచున్న రక్తప్రవాహముల దుర్వాసనలతో నిండినదియు, విచ్చలవిడిగాఁ దిరుగాడునట్టి సెమళ్ల సంచారము గలదియు నగు నీ శ్మశానమునందు నక్కల యారవములు మిక్కిలి భయంకరముగా మ్రోఁగు చున్నవని భావము. (బహు జుగుప్సితస్థాన మీ శ్మశానమని నాయకుఁడు వర్ణించినాఁడు.)

19 ప:— అహరహము = ప్రతిదినము; అహిమహాః + ఆహారమునకున్ = పాములుయొక్కసమూహమే యనెడు మేతచేత (శివపరముగా:— అహిమహాః + హారము =

సర్పసమూహమను హారములచేత); వినాయకాహితతుష్టియై = పక్షుల రాజైన గరుత్మంతునికి హితమును, మోదమును గూర్చునట్టిది (శివపరముగా:-విఘ్నేశ్వరునికిఁ దుష్టిని గూర్చునట్టిదై); శశాంకపాండుర + అస్థికపాలమై = చంద్రుని వలెఁ దెల్లని పునుకలతోను, నెముకలతోను నిండినట్టిదై. (శివపరముగా:—శిరస్సునందుఁ గల చంద్రునితోడను, పునుకలతోడను, నెముకలతోడను గూడినదై); రౌద్రమైన మూర్తిని బోలి = శ్మశానము శివునియొక్క మూర్తిని బోలి యున్నదని భావము. అలంకారము:— శ్లేషాలంకారము, ఉపమ.

21 ప:— విలయ + అభ్ర + ఆభములై = ప్రళయకాలపు మేఘములయొక్క కాంతివంటి కాంతిగలవై; వియత్పథము = ఆకసము; తూలపంక్తుల్ = ఱెక్కల సమూహములు.

తా॥ ఱెక్కలు ప్రళయకాలపు మేఘములయొక్క కాంతిని గలిగి యాకసమును గప్పివేయగా, వేగానిలవశములై సముద్రజలములు భూమిని ముంచివేయుచున్నవా యనునట్లుగాను, అష్టదిగ్గజములు కల్పాంతకాలమా యను శంకతో వీక్షించుచుండఁగాఁ గావివర్ణము దిక్కులందు వ్యాపింప ద్వాదశ సూర్యులకన్న మిన్నయై పన్నగేంద్రుఁడు సమీపించుచున్నాఁడని నాయకుఁడను కొనుచున్నాఁడు.

26 ప:— ఇందునిఁ = చంద్రుని; భీతివలయీకృతమూర్తిని శేషునెంచుచుఁ = భీతిచే చుట్ట చుట్టుకొన్న మూర్తియైన శేషునిగా భావించి (చంద్రుని జూచి నాకు భయపడి చుట్ట చుట్టుకొనియున్న శేషుని జ్ఞప్తికిఁ దెచ్చుకొని యని గరుడుఁ డనుకొనుచున్నాఁడు); అగ్రజుఁడు = సూర్యాగ్రజుఁడు; (అనూరుఁడు. సూర్యుని సారథి).

తా॥ చంద్రుని జూచి, తనకు భయపడి చుట్ట చుట్టుకొనియున్న యాదిశేషుఁడే యని జ్ఞప్తికిఁ దెచ్చుకొని, రథగజంబులు బెదరుటచే సూర్యుఁడు తొట్రుపాటును బొందఁగాఁ దదగ్రజుఁ డగు ననూరుఁడు తన్నుఁ గాంచి మోదమొందుచుండగా, గిరి సానువులఁ జరించెడి మేఘములు తన ఱెక్కలచే దైర్ఘ్యములు గాగ సర్పభుక్తికై మలయాచలమును గరుడుఁడు సమీపించెను.

27 ప:— శోణితంబు = రక్తము; భోగి = సర్పము.

తా॥ ఇతర సర్పములను రక్షించుటకై వధ్యశిలపైఁ జేరియుండి, నేను వచ్చి మీఁదఁబడుదు నేమోయను భయముచే గుండె పగిలి, యా రక్తమంతయు దేహ

మంతటను వ్యాపించెనాయన్నట్లు, రక్తాంశుకయుగళము ధరించియున్న పన్నగమును, వజ్రదండనిభమైన నా ముక్కుతోఁ గ్రుమ్మెదనని గరుడుఁ డనుకొని నాఁడు.

28 ప:- తేంట్లకా = తుమ్మెదలను; సుమవర్షము = పుష్పవృష్టి; నభము= ఆకసము; విలయము = ప్రళయకాలము; ప్రళయ + అంబుద + ఆళియుకా = ప్రళయకాలమునందలి మేఘముల సమూహము.

తా॥ మధుపములు పరిమళముచే మిక్కిలి తృప్తివహించు నట్లాకసమునుండి పూలవాన గురియుచున్నది. దిక్కులు పిక్కటిల్లునట్లు దేవదుందుభులు మ్రోఁగుచున్నవి. ఓహో! తెలిసినది. మదీయజవసంభ్రమ మారుతధూతమై కల్పవృక్షము చలించినది. ప్రళయకాలమేమో యనెడు శంకతోఁ బ్రళయకాలాంబుదములు గర్జిల్లినవని గరుడుఁ డనుకొనుచున్నాఁడు.

## పంచమాంకము

1 ప:- ప్రణయిజనము = హితజనులు, ఆప్తులు.

తా॥ తనకు హితుఁడైన వాఁడింటిముందటి యుపవనమున కేఁగిన్న మాత్రాన మన సపాయమునే శంకించుచుండును. అట్టి హితుఁడు మిక్కిలి దూరముగా నున్న యడవి కేఁగినచో నెట్టి భయము గలుగునో వేఱుగాఁ జెప్పనవసరము లేదుగదా!

2 ప:- భంగవత్ = ముడుతలు గలది (అలలు గలది); క్షౌమయుగము = దుకూలయుగము (తెల్లని వస్త్రముల జంట); తరంగములు = అలలు; ఫేనము= నురుగు; జాహ్నవి = భాగీరథి; వేల = చెలియలికట్ట; క్షీరవారాశి = పాల సముద్రము.

తా. ముడుతలు గలవియు, నలలలోఁ జలించుచున్న నురుగులతోఁ గూడిన నిర్మలోదకములను బోలినవియు నగు తెల్లని వస్త్రములను దాల్చి, జాహ్నవిని బోలిన తన గాదిలిదేవి వెంటఁగొల్చుచు, నిజతేజంబు నతిశయింపఁ జేయుచుండగా, ఈ మహాత్ముఁడు జీమూతకేతువు తన కోడలైన మలయవతి చెలియలి కట్టవోలెఁ దన సమీపమున నిలువఁబడి యుండ, క్షీరవారాశిచందమున మిక్కిలి ప్రకాశించుచున్నాఁ డని ప్రతీహారుఁ డనెను. (శ్లేషాలంకారము)

9 ప:- వెల్లియై = ప్రవాహరూపమును దాల్చి; శాద్వలతలాన = పచ్చిక భూమియందు; ధాతుపీఠిక = గైరికాది ధాతువులయందు; తరుచ్ఛదములు=చెట్ల యాకులు; నైల్యము = నల్లని వర్ణము.

తా. మొట్టమొదట భూమిపైఁ బడి ప్రవాహరూపమును దాల్చి, పిదప నెడయెడముగా స్థూలబిందువుల రూపమునఁ బడియుండి, తర్వాత రాళ్లపైఁబడి చెదరిన బిందువులు గలదై, శాద్వలభూమియందుఁ గీటకసంకులమై యుండి, గైరికాదిధాతువులయం దస్పష్టముగా నుండి, చెట్లయాకులపై గడ్డకట్టి నైల్యము వహించియున్న యీ రక్తధార ననుసరించి, గరుడునిజాడ నరసెదనుగాక యని శంఖచూడుఁ డనుకొనెను.

14 ప:- ద్రోణి = కొండపల్లము; కషణము = ఒరయిక, రాపిడి.

తా. రక్తముచేఁ దడుపఁబడిన ముక్కు రాపిడులచే గిరిసానువులు ద్రోణులైనవి. నేత్రాగ్నులచే సమీపారణ్యము దగ్ధమైనది. భయంకరమైన పాదనఖములచే భూమి గాడిపాతినది. అట్టి మలయశిఖరాగ్రమునం దదిగో పన్నగాంతకుఁడు కన్పించుచున్నాఁడని శంఖచూడుఁ డనుకొనెను.

15 ప:- ధైర్యవార్ధి = ధైర్యమున సముద్రమువంటివాఁడు; పరిశిష్టము = మిగిలినది; గాత్రము = శరీరము; పులకలు = గగుర్పాటు.

తా. అధికముగా రక్తమును బీల్చి త్రాగుచున్నను నిసుమంతయేని బాధను బ్రకటింపఁడు. మాంసమును ముక్కునఁ జీల్చి తినుచున్నప్పటికిని నెట్టి వికారమును బ్రకటించుటలేదు. తినగా మిగిలిన శరీరమునందు స్పష్టముగాఁ బులకలు పొడసూపుచున్నవి. అతనికి నేను కీడును గూర్చుచున్నప్పటికిని నాతఁడు నన్ను హితకారకుని మాడ్కిఁ జూచుచున్నాఁడు. ఇదేమి ధైర్యమహిమయోగదా యని గరుడుఁ డాశ్చర్యమును బ్రకటించుచున్నాఁడు.

19 ప:- మందరమహీభృత్కందరాళిన్ = మందరపర్వత గుహలయందు; రాజతగిరిగ్రావాళిన్ = కైలాసగిరి శిలాతలములయందు.

21 ప. తా. కాలముయొక్క ముగింపుచేత ముల్లోకములను భక్షించుట యందైన యాసక్తిచేఁ జలించుచున్న రుద్రుని నాలుకలవలె భయంకరమైన మంటలచే శబ్దించునట్టిదియు, మిక్కిలి యనిష్టసూచకమైన వాయువుయొక్క పటుత్వముగల నా ఱెక్కలతో వీవఁబడి దగులుచున్న జ్వాలలు గలదియుఁ,

ప్రళయకాలాగ్నివలె భయమును గూర్చునదియు నగు బడబానలమందుఁ బడి, నేనొనర్చిన పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము ననుభవింతునని గరుడుఁ డనుకొనెను.

25 ప:— ప్రాక్కృతము = పూర్వము చేయఁబడినది; అఘము=పాపము.

27 ప:— పులినవిశాలభోగములన్ = ఇసుకతిన్నెలవలె విశాలమైన పడగలయొక్క; వలయితగాత్రులై = చుట్టఁబడిన దేహములు గలవారై, (ఒక్కచో ద్వీపముల సొంపును దలపించుచు, మఱొకచోట సుళ్లుగాను, ఇంకొక చోట సేతువులుగాను దోఁచుచు సర్పములు జలనిధియందు మిక్కిలి ముదముతోఁ దిరుగాడుచుండునుగాక యని గరుడుఁడు చెప్పెను.)

32 ప. తా. 'ఱెక్కలగాలిచే సముద్రములను గలంచివైచి, ప్రచండమైన నేత్రాగ్నులచే నగ్ని సూర్యులను నీరొనరించి, ముక్కుచే నింద్రాదిదేవతల గదాయుధముల నుగ్గొనర్చి యమృతవర్షమును గురిపింతునుగాక యని గరుడుఁ డనుకొనెను.

---

ఈ క్రింది వాక్యములకు సందర్భసహిత వ్యాఖ్య వ్రాయుఁడు :—

1. వచ్చునే పితృపాదసంవాహనమున వచ్చు సౌఖ్యంబు రాజ్య సంవాహనమున.
2. ఋషివచనమ్ము తామృష యెట్టు లౌను!
3. చిరకాలమున కీతఁడు మన్మథుని పాలఁబడినాఁడు.
4. సహజశీతల మైనప్పటికిని, ఈ చందనలతాగృహము నీ సంతాపమును బోఁగొట్టఁజాలకున్నది.
5. లక్ష్మిని వక్షఃస్థలమున ధరింపక మధుసూదనుఁడు మాత్రము సుఖము నొందఁగలఁడా?
6. ఇవి మలయాచలసానువులు కావు. నాగరాజుల యస్థిసంఘాతములు.
7. కౌఁగిటం బూనుఁ బుట్టువుగన్నవాని ధాత్రి కైవడిఁ దాననిత్యతయె త్రొల్త.
8. పరార్థమ్మునకై నడుముం గట్టెడు ఘనుతా త్వాదృశుల జన్మ కలుగుట యున్నే?
9. కలుగుఁగా కిట్లె జన్మజన్మలను నాకు గాత్రలాభంబు లోకోప కారమునకె.
10. విషధరుని ముఖమునుండి విషముగాక వేఱేమి వెల్వడును.
11. లోకాంతరగతుండవైకూడ పుత్ర! విడువనైతివిగదా వినయ క్రమంబు.
12. ఈ దేహమ్మునకు శోభ యెక్కడిదమ్మా!
13. సర్వజంతువధ క్రూరచర్యనుండి యాక్షణమ్మాదిగా విరమించి నాఁడ.
14. గాత్రలాభంబు లోకోపకారమునకె.
15. మందభాగ్యురాలనగు నా మూలమున నీవు మిథ్యావచన వైతివిగదా!

# ముఖ్యప్రశ్నలు



1. మీ నాటకభాగమును బురస్కరించుకొని జీమూతవాహన శంఖచూడుల స్వభావ తారతమ్యము నభివర్ణించునది ?

2. మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని జీమూతవాహనుఁడు ప్రదర్శించిన పితృభక్తిని గూర్చిగాని, పరార్థ పరాయణత్వమును గూర్చిగాని యొక వ్యాసమును వ్రాయుఁడు ?

3. మీ పాఠ్యభాగమును బురస్కరించుకొని జీమూతవాహనుని గుణశీలములఁ బరామర్శించునది ?

4. మీ నాటకభాగమును బురస్కరించుకొని శంఖచూడుని గుణశీలముల నభివర్ణించునది ?

5. నాగానంద నాటకములోని గుణదోషములఁ బరామర్శించునది ?

6. నాగానందనాటకకాలమునాఁటి సాంఘికపరిస్థితుల నభివర్ణించునది ?

7. నాగానంద నాటకమునఁ బ్రధానరస మెట్లు పరిపోషింపఁబడినదో చర్చించునది ?

8. నాగానంద నాటకములోని పాత్రపోషణ విశిష్టత యెట్టిది ?

9. నాగానంద నాటకమున విదూషక పాత్ర ప్రయోజన మెట్టిదో చర్చించునది ?

10. మలయవతి గుణశీలముల నభివర్ణించునది ?

11. నాగానంద నాటకములోని వస్త్వైక్యమును గూర్చి యుపన్య సించునది ?

12. నాగానంద నాటక నిర్వహణ, ప్రదర్శనార్హతలను జర్చింపుఁడు ?

13. నాగానంద నాటకమున బౌద్ధమతమునకు బ్రాహ్మణ మతమునకుఁ గల సంబంధ బాంధవ్యములు వ్యక్తము లగుచున్నవి. విమర్శించునది ?

[పైన బేర్కొనఁబడిన ప్రశ్నలకుఁ దగిన సమాధానముల నాయా వ్యాసములనుండియు నర్థతాత్పర్యాదులనుండియు గ్రహింప వచ్చును.]

—:o:—

# పాలవెల్లి

## మగువ మాంచాల

——//o//——

పలనాటి వీరచరిత్రలో మగువ మాంచాల మఱపునకు రాని మధురమూర్తి విమర్శించునది ?

పల్నాటి వీర చరిత్రములో నభివర్ణింపఁబడిన పాత్రములలో మగువ మాంచాల మిక్కిలి యుత్తమోత్తమమైనది. ఈమె మఱపునకు రాని మధురమూర్తి. ఈమె పవిత్రహృదయము పాఠకులచే మిక్కిలి యాకర్షింపఁబడినది. పెక్కుదినమ్ములు మగని కూరిమికి దూరమై యుండి, కడకు నయ్యది ప్రాపింపఁ దుచ్ఛభోగములఁ దృణీకరించి, భర్తకుఁ గర్తవ్యము నుద్బోధించి, మిక్కిలి యశమును జేకూర్చి, వీరపత్ని యను నామమును సార్థకపఱచుకొన్నది. అట్టి మహాదాశయము గలిగిన మాంచాల పాత్ర పల్నాటి వీరచరిత్రములో శ్రీనాథుని కవితాశిల్పముచేఁ జక్కఁగా మలచఁబడినది.

ఈమె గండువారింటి యాఁడుపడుచు. ఈమె తండ్రి కన్నమనీఁడు. తల్లి రేఖాంబ. పలనాటి కృష్ణుఁడు బ్రహ్మనాయుని కుమారుఁడు బాలచంద్రుఁ డీమెను జిన్నతనమునందే వివాహము చేసికొనియెను. అసూయాగ్రస్తుఁడైన యొక విప్రుఁడు "సౌందర్య మన్నది చానకొసున్న" యని చెప్పఁగా, నిజమని నమ్మి బాలచంద్రుఁడామెను దిరస్కరించి వేశ్యాలోలుఁడయ్యెను. మాంచాల తన దురదృష్టమునకు మిక్కిలి చింతించి మిన్నకుండెను. వియ్యాలవారును నొకరి నొకరు నిందించుకొనక యూరకుండిరి.

ఇట్లుండ కార్యమపూడి సమరక్షేత్రమున మలిదేవాదులకు నలగామని సైన్యమునకు సంకులసమరము జరుగుచుండెను. బ్రహ్మ

నాయుఁడు బాలచంద్రుని పురమునకుఁ గాఁపుంచి, తాను యుద్ధ రంగమున కేఁగెను. చంద్రుఁడు "చాలురాపుల" కిచే బొంగరము లాడుచుండఁగా, నాతని బొంగరము పైపుతప్పి కోమటి యన్నమ్మ కుఁ దగిలెను. ఆమె నొప్పి కోర్చుకొనలేక "మీ కులము పెద్దలు చేయు యుద్ధమున కేఁగినఁగదా నీవుకీ తానవచ్చు"నని పల్కెను. ఆ మాటలకుఁ జంద్రుఁడు మిక్కిలి నొచ్చుకొని, సమరమునకుఁ దానుఁగూడ నేఁగుటకై నిశ్చయించుకొని, తల్లి యగు నైతమ్మ కా విషయము నెఱిఁగించెను. తల్లియు నాతని నా యుద్యమము నుండి మఱలింపఁజేయుటకై ప్రయత్నించి నిష్ఫలమనోరథ యాయెను. ఎట్టకేలకా తల్లి యాతనిని దీవించి, "కయ్యమునకేఁగు పురుషునకుఁ దల్లి దీవెనతో పాటిల్లాలి దీవెనయు నవసరి" మని చెప్పి, బాల చంద్రుని భార్యయొద్దకుఁ బొమ్మని ప్రోత్సహించినది.

ఇన్నినాళ్లనుండియు భార్యముఖమైనను జూడనొల్లకయుండిన చంద్రుని కానాఁడచ్చటకుఁ బోవుటయన మిక్కిలి కంటగింపైనది. అందుల కతఁడియ్యకొనలేదు. చంద్రుని హృదయము నెఱిఁగిన యైతమ్మ తానే యచ్చటకుఁ బోయివత్తునని వియ్యపువారింటికిఁ బయనమైపోయినది. అచ్చట నామెకుఁ జక్కఁగా సత్కారము జరిగినది. అందాలబరిణెయైన కోడలి బాగసునకై తమ్మ మిక్కిలి యచ్చెరువందినది. మాంచాలను జూచుకొని మురిసిపోయినది. ఆమెయైనచోఁ బుత్రుని యుద్ధపరాఙ్ముఖునిఁ జేయఁగలదని విశ్వ సించినది. ఆమెచే నా పనిఁ జేయించుటకు నొప్పందల చేసికొన్నది. తిరిగి యింటికి మఱలివచ్చి యెట్టులో బాలచంద్రు నొప్పించి, మాడలు, చీరలు, మణిభూషణములు మొదలుగాఁ గల విలువగల వస్తువుల నిచ్చి, సోదరసహితముగా నాతని నత్తవారింటి కంపినది.

అతఁ డత్తవారింటికిఁ బయనమైపోవుచు శ్యామాంగి గృహ మున కేఁగినాఁడు. ఆ వేశ్య కల్లబొల్లి మాటలను జెప్పి, కలిగినది

రవంత మూటగట్టుకొన్నది. రిక్తహస్తుఁడై పోవుచున్న చంద్రునకు దారిలో భూసురు లెదురై దీవించిరి. తనయొద్ద సొమ్ము లిచ్చుటకు మిక్కిలి చింతించి, తనయొద్ద గల కటిసూత్రమును వారికిచ్చి పంపెను. సోదరు లాతనిని సొమ్మంతయు వేశ్యకిచ్చినందులకు మిక్కిలి తెగడిరి. కొంచెపడుచు మెల్లగా నాతఁ డత్తవారింటికిఁ జేరికొనినాఁడు.

అల్లుని రాకఁ దెలిసికొని గండువారు గృహమును మిక్కిలి యలంకరించిరి. అల్లుఁడు గృహాభ్యంతరనివాసముఁ జొచ్చి, రత్నకంబళములు పఱచియున్న చవికెలోఁ దమ్ములతో నాసీనుఁడయ్యెను. సోదరసమేతుఁడైయున్న బాలచంద్రునికడకు మాంచాల చక్కఁగా నలంకరింపఁబడి పంపఁబడెను. ఆమె యతిలోకసౌందర్యమునకు ముగ్ధుఁడై చంద్రుఁడు కొంతకాల మా యింట నుండుటకు నిశ్చయించుకొనెను. అది యొఱింగిన సోదరు లాతని కేళిజాములు గడువిచ్చి వెడలిపోయిరి. మాంచాల యాతనిని లోనికిఁ గొంపోయి, తన సౌభాగ్యమునకు నిలయమైన వివిధ ప్రదేశముల నాతనికిఁ జూపించుచుండఁగా, బాలచంద్రుని దృష్టి కేవల మైహికవాంఛలఁ దగులుటం జేసి, వానికిఁ బ్రీతిని గూర్చుటకుగాను లోనికిఁబోయెను. లోనికేఁగి యచ్చట స్నానాదికముల ముగించుకొని యలంకరించుకొని భర్త యొద్దకు రాఁబోవుచు నా విషయమును ముచ్చటించుటకుఁ దల్లి యొద్ద కేఁగెను. రేఖాంబ పుత్రికను బురస్కరించుకొని "భోగములు, కీర్తి యనునవి జీవితమునకుఁ గల రెండు ఫలములు. అందుఁ గీర్తి యుత్తమోత్తమమైన" దని చెప్పి బాలుని మనస్సు నా విషయమందు నిమగ్నమగునట్లు చేయవలసినదని హెచ్చరించి కూఁతును సాగనంపెను.

అప్పటి యా యందమునకు ముగ్ధుఁడై చంద్రుఁ డా యువతి చేలాంచలమును బట్టి లాఁగఁ దదాకర్షణమున ముత్యాల చేరులు

తెగి, చెల్లాచెదరై నేలఁబడినవి. చెదరిన ముత్యాల నేరుచుండఁ బరిమితికాలము మించిపోయినది. ఇంతలో ననుజులువచ్చి చంద్రుని యుద్ధమునకు రమ్మని పిలిచిరి. బాలుని మనస్సు భార్యపై నుండి మఱలలేదు. అనుజు లాగ్రహావేశులై, తమ్మైనను బంపుట కనుజ్ఞ నీయమనిరి. అట్టి క్లిష్టసమయమున నా మగువ మగనికిఁ గర్తవ్యము నుపదేశింపఁదలచినది. భర్తను బురస్కరించుకొని, తనతోఁ బెనఁగిన నెట్టి ప్రయోజనము నుండదనియు నితరులతోఁ బెనఁగి కుల వైరముఁ దీర్పుమనియు నుద్బోధించినది. మఱియు ననపోతు బ్రాహ్మణుఁడనియు, వానిని యుద్ధవిముఖునిగాఁ జేయుమనియుఁ బ్రబోధించినది. అట్లు కానినాఁడు బ్రహ్మహత్య తప్పదనియు నొక్కి వక్కాణించినది. రాకరాక బహుకాలమునకు వచ్చిన భర్త దగ్గఱ నాశ్లేష సౌఖ్యము నాకాంక్షింపక, మగనికిఁ గర్తవ్యోద్బోధముగావించి యుద్ధకార్యోన్ముఖునిగావించి ఖడ్గము చేతికందించి కదనరంగమున కంపినది. ఆ యిల్లాలు స్త్రీ సహజములైన కోరికలను మగని యెదుటఁ గోరలేదు. భర్తను బ్రహ్మహత్యనుండి దూరముగా నుండుమని కోరినది. ఆ వీరపత్ని కోరికను బాటించి బాలచంద్రుఁడు కదనరంగమునకుఁ బయనమయ్యెను. అట్టి యబలాజనదుర్లభమైన సాహసమును బ్రకటించి, స్వార్థమును విడనాడి, భర్తను దీవించి, చంద్రహాసము చేతికిచ్చి, చంద్రుని సమరక్షేత్రమునకుఁ బంపిన మగువ మాంచాల మనకు మఱపునకు రాని పాత్ర.

---

# దమయంతి పెండ్లి

శ్రీనాథుఁడు దమయంతీ స్వయంవరమును తెలుఁగు వారింటి పెండ్లిగా వర్ణించిన విధానము నభివర్ణించునది ?

శ్రీనాథుఁడు భారతములో సంగ్రహముగా వర్ణింపఁబడిన నలకథ నొక విశిష్టమైన కావ్యముగాఁ దీర్చిదిద్దినాఁడు. ఆ కథకుఁ బురాణత్వమును బరిహరించి, కాంతాసమ్మిత మనఁదగు కావ్యత్వమునారోపించి, గ్రంథమంతటను దెనుఁగుఁదనమును బ్రస్ఫుటింపఁ జేసినాఁడు. దమయంతిని తెలుఁగువారింటి యాఁడుబిడ్డగాఁ దీర్చి దిద్దినాఁడు. ఈ విషయ మా కావ్యములోఁ జిత్రింపఁబడిన పెండ్లి వేడుకలు, బువ్వముబంతులు మొదలుగాఁ గల సన్నివేశములను బరిశీలించినచో వ్యక్తములు గాకపోవు.

పెండ్లినాఁడు పెండ్లికుమార్తె నలంకరించు విధానమంతయుఁ దెలుఁగువారు పాటించెడు నాచారములకు లోఁబడి యున్నది. క్షత్రియగృహములలో వివాహ సందర్భములయందు మంగళస్నానములను జేయించెడు సంప్రదాయము నీ కవివరేణ్యుఁడు చక్కఁగాఁ బాటించి వర్ణించినాఁడు. ఈ గ్రంథమున దమయంతి ధరించిన సొమ్ములన్నియుఁ దెలుఁగువారి సొమ్ములే. పెండ్లికూతు రీసందర్భమున ధరించిన కంకణములు, మట్టియలు, వీరమద్దియలు, పాయవట్టములు, పాలికలు మొదలుగాఁ గల యాభరణవిశేషము లన్నియుఁ దెలుఁగువారి యాచారములనే ప్రతిబింబింపజేయు చున్నవి. అలంకరణమైనతర్వాత "బ్రాహ్మణ ముత్తైదువ"లకుఁ జందనతాంబూలాదు లిచ్చి సత్కరించిన దమయంతి తెలుఁగుఁ గుటుంబములోఁ జేరి, తెలుఁగువారి యాచార వ్యవహారములఁ బాటించిన దనిన నతిశయోక్తి కానేరదు.

వివాహగృహాలంకరణ విధాన మంతయుఁ దెలుఁగువారి యాచారవ్యవహారములనే యనుసరించిన ట్లీకవి వర్ణించియున్నాఁడు. పెండ్లికొడుకు విడిదియింటినుండి వచ్చుటయు, వియ్యాలవారు స్వాగతము చెప్పుటకై "ఎదురుకోలు" నడచివచ్చుటయు, వివాహ సందర్భమున "మధుపర్కము, కంకణబంధము, పాణిగ్రహణము" మొదలుగాఁ గల వైదిక కార్యములను నిర్వహించుటయు, నల్లునికి వస్తువాహనముల నిచ్చి సత్కరించుటయు, కొంగుముడులు వేయుటయు, ధ్రువారుంధతీ సందర్శనము, మహదాశీర్వచనము, లాజ హోమము, పునస్సంధానము మొదలుగాఁగల తెలుఁగువారి వివాహాచార వ్యవహారములన్నియు నలుని వివాహసందర్భమున సంక్రమముగా నిర్వహింపఁబడినట్లు శ్రీనాథుఁడు నైషధకావ్యమున వర్ణించియున్నాఁడు.

వివాహ సందర్భమున నేర్పాటుచేయఁబడిన బువ్వముబంతి యచ్చముగాఁ దెలుఁగువారి యిండ్లలో జరుగుచుండెడి బువ్వము పంక్తియే యని చెప్పవచ్చును. అట్టి విందుసందర్భమున బంధువులు పరస్పరము చేసికొను సరసములు, వేళాకోళములు, వెక్కిరింతలు మిక్కిలి సహజముగాను మనోహరముగాను నీ కావ్యములో నభివర్ణింపఁబడినవి. తెలుఁగువారి యిండ్లలోఁ బెండ్లిభోజనము లిట్లే జరుగుచుండును.

పెండ్లిభోజనమంతయుఁ దెలుఁగువారి భోజనమునే తలపించుచున్నది. మనము విందుల సందర్భములలోఁ దినెడి పిండివంటలనే దమయంతీ వివాహసందర్భమున శ్రీనాథుఁడు పేర్కొనినాఁడు. కూరలన్నియుఁ దెలుఁగువారి కూరలే. పుల్లపెరుఁగు కలిపిన యన్నమునకు నావకాయ నంజుకొన్నారట. ఇది యాంధ్రుల యభిమాన వ్యంజనమయిన యావకాయ యనుటలో సందేహము లేదు. భోజ

నము తర్వాత నందఱు నరఁటిపండ్లను దినుచుండిరట. ఇదియు మన యాచారమే.

భోజనములైనపిమ్మట నందఱు చేతులు కడుగుకొని తాంబూలములు స్వీకరించిరి. ఆ సందర్భమునందుఁ గూడ వేళాకోళములు చేసికొనుట పరిపాటి. అల్లుఁడుగారు, నడపకాఁడుఁ దన సమీపముననే యుండఁగా యువరాజైనదముఁ డొక తమ్మలపాకులో మైనముతోఁ దయారుచేసిన యొక తేలునుంచి దాని నడపకాని చేతికిచ్చినాఁడు. అతఁ డది నిజముగాఁ దేలే యేమో యని యెగిరి యొక్క గంతు వేసినాఁడఁట. అడపకాని పిఱికిదనమును జూచి యందఱు గొల్లుమని నవ్వినారఁట. ఈ విధముగా దమయంతీ వివాహసందర్భమున నేర్పాటుచేయఁబడిన బువ్వముబంతి యంతయుఁ దెలుఁగువారి బువ్వముబంతి యాచారములను దలపించునట్లు శ్రీనాథుఁడు చక్కఁగా వర్ణించినాఁడు.

దమయంతి నత్తవారింటికిఁ బంపుచు భీమరాజుచేసిన హితోపదేశము తెలుఁగుపిల్లలకుఁ దలిదండ్రులచేయు హితోపదేశమే యని చెప్పవచ్చును. పసుపుకుంకుమలకోస మని దమయంతికి నూఱు గ్రామముల వ్రాసియిచ్చినారఁట. ఇది మన తెలుఁగుదేశములోఁ బాటింపఁబడెడు నాచారమే కదా! ఇత్యాది విశేషములతో దమయంతీ వివాహ మతి మనోహరముగా వర్ణింపఁబడినది. నలకథ పురాణకథ యైనప్పటికిని శ్రీనాథుఁడు దాని కమర్చిన నేపథ్యము వలన దమయంతీ వివాహము తెలుఁగువారికి మిక్కిలి ప్రీతిపాత్ర మైనది.

---

# మాలదాసరి

—/o/—

ఆముక్త్య మాల్యదయందు రాయలవారు చిత్రించిన పాత్రములలో మాల దాసరి పాత్రము మిక్కిలి విశిష్టమైనది విమర్శించునది ?

శ్రీకృష్ణదేవరాయలు మాలదాసరి పాత్రమును విష్ణుచిత్త గోదాదేవి పాత్రములవలెఁ ప్రబంధ లక్షణములకు లోనైన పాత్ర ములవలెఁగాక సహజపాత్రముగా వర్ణించియున్నాఁడు. మాలదాసరి యొక విష్ణుభక్తుఁడు. ద్వంద్వయుద్ధ చాతురీధురీణుఁడు. శాస్త్రవాద దక్షుఁడు. మహావదాన్యుఁడు. నిరత సత్యవ్రతుఁడు. కరుణా మూర్తి. ఇట్టి విశిష్టమైన గుణములను ప్రోగుచేసి మాలదాసరి పాత్రమునందు నిహిత మొనర్చినాఁడు. స్వభావసిద్ధమైన మాల దాసరి వేషమును కనులకుఁ గట్టినట్లు వర్ణించినాఁడు. చమురైన తోల్కుబుసమును, టెక్కియును ధరించి, చెవులయందు నిత్తడి శంఖచక్ర కుండలములు మెఱయుచుండగా, దివెదారికొమ్మును, తోలుతిత్తిని, జోడమ్మును గలిగి, మొగలాకు గొడుగుఁ బట్టుకొని, విష్ణుదేవుని పాదుకయుఁ, దిపిరిదండెమును ధరించి, చిటితాళములు వేయుచు మాలదాసరి యాముక్తమాల్యదయందు మనకు దర్శన మిచ్చును.

అతఁడు వామనావతారమున విష్ణుదేవుఁడు నివసించుచుండిన "కురుంగడి" కి మూఁడు యోజనముల దూరమున నొక గ్రామము నందు నివసించుచుండెడివాఁడు. ప్రతిదినము నాతఁడు కురుంగడికిఁ బోయి యచ్చటి విష్ణుదేవుని మంగళనామ కైశికీరాగమున గీర్తించు చుండెడివాఁడు. అగ్రవర్ణముల వారియెడ నాతనికి మిక్కిలి గౌరవ భావ ముండెడిది. వెన్నునికి సాష్టాంగముగ నమస్కరించి, ప్రసాద వినియోగ మగుదాఁక వేచియుండి, యా పిదపఁ ద్రివర్ణేతరజాతి

దయతో నిష్ఠప్రసాదమును, దంపెసాచి మిక్కిలి భక్తితో గైకొని దానిని భుజించెడివాఁడు. గుడిలోని కేశవునకు పిలుపు లేక, యాతఁడాలయ బహిరావరణ ప్రదక్షిణముమాత్రము చేసికొని, ప్రొద్దెక్కిన పిదపఁ దన గ్రామమునకుఁ బోవుచుండెడివాఁడు.

అతఁడొక నాఁ డర్ధరాత్రమున గోడిగూఁత విని, వేళ యతిక్రమించునేమోయని కురుంగుడికిఁ బయనమై పోవుచుండెను. కటికి చీకటిలో దారితప్పి యొక శూన్యగహనవాటిని బ్రవేశించెను. అచట నాతఁడొక వటవృక్షమును గాంచి, యా భూరుహమును సమీపించెను. అంతలో నొక బ్రహ్మరాక్షసుఁ డా వృక్షము నుండి క్రిందికి దుమికి యాతని యెదుట నిలిచెను. మాలదాసరి మిక్కిలి లావరియగుటచే బెగడొందక రాక్షసుని దన వాఁడిశరముచేఁ బొడిచెను. రాక్షసుఁ డా శరమును ద్రుంచివైచి, మాలదాసరితోఁ బోరుట కుపక్రమించెను. ఇరువురకుఁ గొంతసేపు ద్వంద్వయుద్ధము జరిగినది. మాలదాసరి రాక్షసునితోఁ బోరుసందర్భమున "విష్ణుపదస్మృతి నాత్మ నేమఱక పెనఁగులాడుచుండెను. ఆతని కాత్మబలమునకుఁ దోడు దైవబలమును సమకూడి ద్విగుణీకృతమైన బలమేర్పడెను. బ్రహ్మరాక్షసుఁడు తన సహచరులైన యితర రాక్షసుల సహాయముతో దాసరిని బంధించెను. మాలదాసరియుఁ బట్టువడిన తర్వాతఁ గూడ రాక్షసునితోఁ బెనఁగినాఁడు. ఎట్టకేలకు బ్రహ్మరాక్షసుఁ డాతనిని జేర్చికట్టి చెట్టుమీఁదికిఁ గొంపోయినాఁడు.

మాలదాసరి రాక్షసునితోఁ బెనఁగులాడిన దాత్మరక్షణము కొఱకుఁగాదు, కురుంగుడికిఁ బోయి భగవత్సంకీర్తనము గావించుట కొఱకు. రాక్షసునికిఁ బట్టువడిన పిదప నాతఁడు బ్రహ్మరాక్షసునితో నెఱపిన వాద ప్రతివాదముల వలన నాతనికిఁ గల శాస్త్రజ్ఞానము వ్యక్తమగుచున్నది. ఆతనికిఁ గల వైదుష్యమంతయు శ్రుతపాండి

త్యము. కుఱుంగుడిలోని వైష్ణవభాగవతుల పరిచయభాగ్యముచే నాతని కట్టి పాండిత్య మబ్బినది. అతఁడు బ్రహ్మరాక్షసుని కెఱిఁగించిన వేదసూక్తులు, ధర్మసూక్ష్మములు నపూర్వములైనవి. దాసరి "నేను భాజనగతాన్నమను. ఎక్కడికిఁ బోగలను? పెనఁగులాడక ప్రాణరక్షణ విషయమున నుపేక్ష యొనర్చుట పాపమని పెనఁగులాడితిని గాని నాకు శరీరము మీఁద కాంక్ష లేదు సుమా!" యని రాక్షసుఁడు నమ్మఁబలికినాఁడు. వైకుంఠునిఁ బాడి మఱల వత్తునని బతిమాలినాఁడు తన యనుదిన వ్రతమున కెట్టి యాటంకమును గలుగఁగూడదను పూనికచేతనే రాక్షసునితో నింతసేపు ప్రార్థింప సాగినాఁడు. కాని బ్రహ్మరాక్షసుఁ డందుల కంగీకరింప లేదు.

తుట్టతుదకు మాలదాసరి నారాయణస్మరణము గావించి శపథమొనర్చినాడు. "విష్ణుతో నివ్వలివేల్పు గణియించిన పాతకి నౌదు" నని ప్రతిన సలిపినాఁడు. అప్పటికి బ్రహ్మరాక్షసుఁ డంగీకరించినాఁడు. సత్యవ్రతపరాయణుఁడైన మాలదాసరి సంతోషాంతరంగుఁడై కుఱుంగుడికిఁబోయి విష్ణుదేవుని రణద్విపంచియై స్తుతికలిత ప్రబంధములఁబాడి, యచట నాలస్యముచేయక రాక్షసునకిచ్చిన మాటను దక్కించుకొనుటకై, రాక్షసుని కడకు వచ్చినాఁడు. మాలదాసరిని జూచిన బ్రహ్మరాక్షసుఁడు ప్రమదపులకితగాత్రుఁడైనాఁడు. ఆతని సత్యవ్రతదీక్షను బహువిధముల శ్లాఘించి, యాతనికి భక్తితోఁ బ్రదక్షిణము గావించినాఁడు. అట్లు బ్రహ్మరాక్షసునిచే శ్లాఘింపఁబడిన మాలదాసరి సత్యవ్రతము మిక్కిలి ప్రశంసనీయమైన దనుటలో నతిశయోక్తి యుండదు.

అట్లు మాలదాసరి రాక్షసునియెదుటఁ బ్రత్యక్షమై తన్ను భక్షింపుమని వేఁడుకొనినాఁడు. బ్రహ్మరాక్షసుఁ డతిదీనముగా "నీవంటి భాగవతులుం బావనులుగఁ జేయలేని మఱి గతియేదీ?"

యని మాలదాసరిని వేఁడుకొనినాఁడు. అంతట మాలదాసరి రాక్షసుని వాంఛిత మెట్టిదో తెలుపుమనఁగా 'కైటభారిం బాడిన నేఁటి పాటఫలంబు ని'మ్మని యడిగినాఁడు. అందులకు దాసరి యంగీకరింపలేదు. బ్రహ్మరాక్షసు డంత "సంగీతఫలంబున సగమైనను బ్రసాదింపు" మని ప్రార్థించినాఁడు. అందులకుఁగూడ నాతఁ డంగీకరింపలేదు. తన యదృష్టవిశేషముచే మానవజన్మమునఁ దాను కష్టపడి సంపాదించిన పుణ్యఫలమును బ్రహ్మరాక్షసున కిచ్చుట కంగీకరింపకపోవుటయు న్యాయమే నని యిప్పట్టునఁ దోపక పోదు. చివరకు సంగీతఫలమునఁ బాతికపాలైనను బ్రసాదింపమని రాక్షసుఁడు బతిమాలుకొనినాఁడు. అందులకుఁ గూడ దాసరి యియ్యకొనఁ డయ్యెను. తుట్టతుదకుఁ బ్రభాత సమయమునఁ బాడిన చరమగీతఫలమునైనను బ్రసాదించి, నన్నువిపన్నుని జేయుమని పాదములపైఁ బడినాఁడు. పాటలోఁ బాతికపాలైనను నిచ్చుట కంగీకరింపని మాలదాసరి మిక్కిలి ప్రసన్నుఁడై బ్రహ్మరాక్షసునికిఁ జరమగీత ఫలము నిచ్చి యాతని కోటికను నెఱవేర్చినాఁడు. ఇట్టి విశిష్టమైన మాలదాసరి పాత్రమును దన ప్రతిభాచిత్రణముచే నాముక్తమాల్యదయందు శ్రీకృష్ణదేవరాయలు చక్కఁగాఁ దీర్చిదిద్దినాఁడు.

---

# శాలీనుఁడు

—/౧/—

పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ కావ్యకథాసృష్టిలో శాలీనుఁ డొక మధురమూర్తిగాఁ బరిగణింపఁబడినాఁడు. పరామర్శించునది?

కళాపూర్ణోదయములోఁ బింగళి సూరనార్యునిచేఁ జిత్రింపఁబడిన పాత్రములలో శాలీనుని పాత్ర ముత్తమోత్తమ మైనది. ఆతని తలిదండ్రు లెవ్వరో తెలియదుగాని యాతఁ డొక గొల్లపుటల్లుఁ డని తెలియవచ్చుచున్నది. ఆతని భార్య సుగాత్రి. ఆమె యొక పూజారి యనుఁగుఁబుత్రిక. శాలీనుని యత్తగారికి నోరు కొంచెము పెద్దది. ఆ యింట నామెమాటకుఁ జెలామణీ యెక్కువ.

తొలి కలయిక యనుటచే ముత్తైదువలు కొందఱు సుగాత్రిని జక్కఁగా నలంకరించి పడకటింటికిఁ బంపిరి. సహజసౌందర్యవతియైన శాలీనునికి మిక్కిలి ప్రీతి. బుట్టబొమ్మవలెఁ దొడిగినట్లుండు నలంకారములన్న నాతనికి గిట్టదు. అందుచేత నే యా రాత్రి యాతనిని సమీపించిన సుగాత్రిని నేత్రములతోఁ గూడఁ జూడలేదు. అది కారణముగా నామె యచ్చటఁ గొంతసేపు వేచియుండి విసిగివేసారి వెడలిపోయినది. ఇట్లే రెండుమూఁడు రాత్రులు గడచిపోయినవి. మగఁడొల్లమికి సుగాత్రి కారణము నరయలేకపోయినది. శాలీనుఁడైనను దన యభీష్టమును వెలిపుచ్చలేదు. చెలికత్తెలవలనఁ దల్లికి విషయ మిట్టిదని బోధపడలేదు. చెలికత్తె లేకాంతముగా సుగాత్రికిఁ దత్త్వము నుపదేశించినారు. సుగాత్రియుఁ దదీయయుక్తుల నెల్లఁగను సాగించి చూచినది. కాని శాలీనుని యెదుట నామె పాచికలు వమ్ములైనట్లే, యుక్తులన్నియు రిక్తసూక్తులైనవి, కాని సుగాత్రికి మగనిపైఁ గల మక్కువ సడలలేదు. మంగళసూత్రం బీపాటి శుభస్థితి నుండుటయే పదివేలని

భావించుకొని, యాతని నేమియు నిట్టట్టాడకుండఁ దల్లిని బ్రార్థించుచు నోరిమితోఁ గాలముఁ బుచ్చుచుండెను.

శాలీనునికి నత్తగారియెడఁ జనవు తక్కువ. అత్తగారికి సుగాత్రి కడుపుపండి మగపిల్లవాఁడు పుట్టినఁ జూడవలయుననెడి కుతూహలము మెండు. కాని శాలీనుని యిల్లరికము వట్టి గొడ్డుతాకట్టుగాఁ బరిగణింపఁబడినది. ఆతని నింటినుండి వెడలగొట్టెద మన్నఁ గూఁతురిని గాఱియ నెట్టుట యగునేమో యని భావించుచుండెడిది. ఆమె తుట్టతుద కొక యుపాయము నాలోచించి, యల్లునికిఁ బూలతోఁటపైఁ బెత్తన మిచ్చినది. ఆతనిని బిలిచి యా విషయము నెఱిఁగించినది.

శాలీనుఁ డా తోఁటపని జేయుట కియ్యకొనినాఁడు. ఇప్పుడు శాలీనుఁ డొక తోఁటమాలి. ప్రత్యహము తోఁటకుఁ బోయి యచట నిర్వహింపవలసిన కార్యకలాపములఁ జేయసాగినాఁడు. పాపము సుగాత్రి మగని కష్టమును జూచి యోరనఁజాలకపోయినది. తోఁట పనిలో భర్తకుఁ దోడ్పడవలయునన్న కుతూహల మామెలో రేకెత్తినది. కాని సిగ్గుతెఱ మఱుఁగై యామెను బాధింపసాగినది. ఇట్లుండ నొక్కనాఁడు పెనువాన కురిసినది. మగఁ డా వానలోఁ దోఁటలో నున్నాఁడని సుగాత్రి మిక్కిలి యలమటించిపోయినది. ఆమె శారదను బ్రార్థించుచు మార్గమును బట్టి తోఁటలోనికిఁ బోయినది. ఎప్పటియట్లు శుభవర్తనమున నున్న భర్తను జూచి మిక్కిలి సంతోషించినది. బ్రాహ్మీప్రసాద విశేషమును గొనియాడుచు నామె తిరిగి యిలు సేరినది. ఇట్లే కొన్నాళ్ళు సుగాత్రి లజ్జచే భర్తకు దూరముగా నుండిపోయినది. కొన్నాళ్ళకు సిగ్గుతెఱ తొలఁగిపోయినది. మునుపటివలనే యలంకరించుకొని మగఁడున్న తోఁటకుఁ బ్రత్యహంబును బోసాగినది.

అలంకరణముల నొక మఱుగునఁ బెట్టి, తోటపనిలో నామె మగనికిఁ దోడుపడసాగినది. ఇది చక్కని యదనని మదనుఁ డించు విల్లెక్కువెట్టినాఁడు. ఈ సందర్భమున శాలీనుడుఁ తన యిల్లాలిలోఁ దన కిష్టమైన సౌందర్యమును దిలకించినాఁడు. అతని హృదయములో వలపులు కులుకులాడినవి. మిక్కిలి తమకముతో సుగాత్రిని గాఁగి లించుకొనినాఁడు. పూఁబొదరిండ్లలో నామెను మదన మహారాజ్య భోగమహిమయందుఁ దెల్పినాఁడు. సుగాత్రియు నేఁటికి నా పుణ్యము పండినదని మురిసిపోయినది. ఇన్నినాళ్లనుండియు మగఁడు తన్నుఁ దిరస్కరించినందులకుఁ గారణ మామె యాతని నడుగలేదు. అతఁడును జెప్పలేదు. పారవశ్యములో నీ ప్రశ్న లడుగంటిపోయినవి. సుగాత్రి యింటికి వచ్చినది. ఆవులించినఁ బ్రేవులు లెక్కపెట్టఁ గల చెలికత్తె లామె ముఖవికాసాదులచే గుట్టు తెలిసికొనిరి. తల్లియు సంతోషించినది.

ఆనాఁటి రాత్రి యెప్పటికంటె మిక్కిలి యింపును గూర్చెడు నలంకరణములను ధరించి పడకటింటి కేఁగినది. కాని మగఁడు కన్నెత్తియైనను జూడలేదు. గంపెడాశతో వచ్చిన సుగాత్రి కేమియుఁ దోపలేదు. మగ డట్లామె నొప్పరికించుటకుఁ గల కారణ మామె యడుగలేదు. ఆతఁడు చెప్పలేదు. ఇరువురు కొంతకాలము మూఁగ నోమును బట్టిరి. ఆమె తిరిగిపోవుట కుపక్రమించినది. తుట్టతుదకు మనసు దిట్టముచేసికొని భర్తచెంత కేఁగినది. "కడుఁద్రిమ్మటచే శ్రమమొందినారు గాఁబోలును! బోదునా? నిదరవోయెదరే" యని పలికినది. అలంకరణములఁ జూడలేక కన్నులు మూఁతలుపడిన శాలీనుఁ డిచ్చటి కేల వచ్చితివని సుగాత్రిని ప్రశ్నించినాఁడు. సుగాత్రి యీ ప్రశ్నతో నిరుత్తరయైనది. కొండొక సేపూరకుండి లోకములో స్త్రీలు భర్తదగ్గఱ కేకోర్కెతో వత్తురని భర్తనడిగినది. ఇంచుక తూలనాడినది. కాని శాలీనుని హృదయము కఱుఁగలేదు. తెచ్చి

పెట్టుకొన్న సౌందర్యమా శాలీనుని హృదయము నాకర్షింపలేదు. సుగాత్రి యంతరంగమునఁ గంతుసంతాప మతిశయించినది. పాన్పుపైఁ గూర్చొని పాదముల నొత్తసాగినది. కాని శాలీనుఁడు తన పట్టుదలను విడనాడలేదు. ఎంత లాలించినను శాలీనుఁ డున్ముఖుఁడు గాలేదు. ఇఁకఁ దానేమి చేయఁగలదు. ఆమె పాదము లొత్తుచునే యుండినది. ఇంతలోఁ దెల్లవాఱినది.

మఱునాఁ డరుణోదయంబునఁ దొలినాఁడువలనే తోట కేఁగినది. అలంకరణములు మఱుఁగున దాఁచి, భర్తకుఁ దోటపనిలో సాయపడసాగినది. అదిచూచి భర్త యామె నాదరించినాఁడు. ఇరువురు మైమఱచినారు. సుగాత్రి యిప్పటికి రహస్యమును దెలిసికొన్నది. కృత్రిమభూషణములు భర్త కింపును గూర్చవని నిర్ధరించుకొన్నది. మగఁడు చెప్పఁగాఁ దెలిసికొనలేదు. తన యనుభవము చేతనే భర్తయభీష్టమును దెలిసికొనఁగలిగినది. వారి యనురాగములలోఁ బొరలుపీడినవి. నాఁటఁగోలె వారి దాంపత్య నావ ప్రణయాంబుధిలోఁ బయనమై పోసాగినది. పైకొనివచ్చిన కాంతను దిరస్కరించిన ధార్మికతపస్వి ప్రవరుఁడు. కులకాంతయెడనే సహజ సౌందర్యము నాకాంక్షించి, తదనుభవమును బడిసిన కళాతపస్వి శాలీనుఁడు.

# కాటమరాజు — (పాత్రపోషణము)



కాటమరాజు కథను సంగ్రహించి, తెలుఁగునాట నా కథకుఁ గల ప్రాముఖ్యము నభివర్ణించునది?

కాటమరాజు కథ యొక గేయకావ్యము. దీనిని రచించిన కవి గంగుల పినయెల్లయ. ఈ గేయకావ్యమునం దితఁ డపూర్వ ప్రజ్ఞను బ్రకటించినాఁడు. ఈ కవివరేణ్యుఁడే కాక కాటమరాజు కథను పలువురు కవులు గ్రంథస్థములుగాఁ జేసియున్నారు. అట్టి కావ్యములన్నింటిలోను యెల్లయ రచించిన గేయకావ్యము మిక్కిలి విశిష్టమైనది. ఈ కవివరేణ్యుఁడు పాటించిన పాత్రపోషణ విధాన మత్యుత్తమమైనది. పెద్దన ప్రవరుఁడు, సూరన శాలీనుఁడు, గురుజాడ గిరీశము, వేదము వారి యుగంధరుఁడు పాఠకుల హృదయసీమలలోఁ గలకాలము నిలిచిపోయెడి పాత్రములు. అట్లే కాటమరాజు కథలోఁ జిత్రింపఁబడిన కాటమరాజు పాత్రము మన హృదయములనుండి యెన్నటికిని మాసిపోయెడిది కాదు. ఈ గేయకావ్యములో నీ కవి చిత్రించిన పాత్రములలోఁ గాటమరాజునకుఁ దర్వాత మిక్కిలి ప్రశంసింపఁదగిన పాత్రములలో ఖడ్గతిక్కన, బ్రహ్మరుద్రయ్య యను పాత్రము లగ్రశ్రేణికిఁ జెందినవి. ఇతర కవులు కొందఱీ పాత్రములను జేపట్టి కావ్యములను వ్రాసి యుండినప్పటికిని, పాత్రపోషణ విధానమున నీ గేయ కావ్యకర్తకు వారందఱుఁ దీసిపోదురని చెప్పవచ్చును.

కాటమరాజు యాదవ కథానాయకుఁడు. ఇతని తండ్రి పెద్దిరాజు. తాత ఆవులవలురాజు. ఇతనికి నలనన్న, ఆవులన్న, పశువులన్న, కత్రేలయుఁడు, కాటమరాజు నను నైదు నామాంతరములు గలవు. ఇతని జననము ధాతనామ సం॥ ఫాల్గున శుద్ధ పంచమి

గురువారము. ఆ దినము యాదవులకుఁ బర్వదినము. శ్రీకృష్ణుఁడే కాటమరాజై జన్మించెనని యాదవుల విశ్వాసము. ఎద్దుమోత గల యాదవ శాస్త్ర మీ కాటమరాజు ననుసరించియే సృష్టింపఁబడినది. ఇతనికి డెబ్బదియేడు బిరుదులున్నట్లు తెలియవచ్చుచున్నది. తండ్రి చనిపోఁగా నీతఁడు కొంతకాలము ముత్తాసుల యిండ్లలోఁ బెరిగి పెద్దవాఁడై రాజ్యమేలినట్లు తెలియవచ్చుచున్నది. అతఁడు పశువులను మేపుకొనుచు కాశినుండి కంచివఱకు వచ్చినాఁడని తెలియవచ్చుచున్నది. నెల్లూరు నేలుచుండిన నలసిద్ధిరాజు నొద్దఁ బుల్లరి యొడంబడికను జేసికొని పశువులను మేపుకొని చుండెడివాఁడనియుఁ దెలియవచ్చుచున్నది.

ఈ కాటమరాజు కథ ననేకు లనేక విధములుగా వ్రాసియున్నారు. 'కాటమరాజు కథ' 'బట్టు రాయబారము' 'ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాట' 'కోటపాటి తాటివృక్షము తెచ్చెడి కథ' 'అగుమంచి కథ' మొదలుగాఁ గల గ్రంథములన్నియు నీ కాటమరాజునకు సంబంధించినవి. ఇన్ని ఖండ రచనములలో నఖండముగాఁ దోఁచు కాటమరాజొక యపూర్వమైన వ్యక్తి యని తోపకపోదు. ఆయా గ్రంథములఁ జదువుచున్నప్పుడు మొట్టమొదట దర్శనమిచ్చు వీరుఁడు కాటమరాజు. పైన వివరింపఁబడిన కావ్యములన్నియు గేయకావ్యములు. ఆయా కవు లీ పాత్రము నాధారముగాఁ జేసికొని, వారు చిత్రించిన మానసిక తత్త్వ చిత్రణము, వ్యక్తి చిత్రణము మిక్కిలి విచిత్రముగా గోచరించుచుండును. పాత్ర చిత్రణ మింత యుత్తమస్థాయిలో లేకపోయి యుండినచో, నీ కాటమరాజు కథ కేవలము శ్రవ్యమేమై, సంప్రదాయ కథకుల నోళ్ళలో మాత్రమే యుండి, వ్రాఁతకోఁతల కెక్కక యడగారిపోయి యుండెడి దేమో!

గేయకావ్య రచయితలు తమ కావ్యములలో నీ కాటమరాజు ప్రసక్తి వచ్చినప్పుడు మిక్కిలి పరవశులై యావేశముతో రచనను సాగించియున్నారు. ఆయా సన్నివేశములలో వా రవలంభించిన యావృత్తివిధానమువలనఁ గాటమరాజు రూపచిత్రణమును, శౌత్ర చిత్రణమును, మనస్తత్త్వ చిత్రణమును సాధింపఁబడినవి. కథకుఁడు కాటమరాజు కథను వల్లించినప్పుడు శ్రోతల హృదయములోఁ బులకలు పొటమరించును. ఆ పాత్రములో మనము లీనమైపోదుము. దానితో రసానుభూతి పరాకాష్ఠ చెందును. రచనము నాటకీయముగా సాగిపోవుచుండును. ఇది కాటమరాజు కథలోఁ గల ప్రత్యేకత. పాత్ర చిత్రణమున కునికిపట్లైన ప్రబంధములను గాటమరాజు కథ తలదన్నినదన్న నతిశయోక్తి కానేరదు.

ఒకనాఁడు మనుమసిద్ధిభట్టు "రాయశృంగావళి" కాటమరాజు దగ్గఱకుఁ బుల్లరి యడుగవచ్చినాఁడు. ఆ సందర్భమున నాతనితో యాదవులభట్టు "కొమారబంగారము" పలికిన పలుకులలోఁ గాటమరాజు బలపరాక్రమములు, వ్యక్తిత్వము, మనస్తత్వము ప్రతిబింబించుచున్నవి.

"వినురాయశృంగార ! వివరంబుగాను
... ... ...
... ... ...
అతులప్రతాపి మహాధైర్యశాలి
దురితదూరుఁడు బుధతోషి తేఁద్రుండు."

ఈ గేయకావ్యములోఁ గాటమరాజునకుఁ దర్వాతఁ జేర్పఁదగినవారు ఖడ్గతిక్కన, బ్రహ్మరుద్రయ్యాచుని మొదలైనవారు. ఈ కవివరేణ్యుఁడు తెలుఁగునాఁటఁ [illegible] యందుఁ గల ఖడ్గతిక్కనాదిపాత్రముల సందర్భముగాఁ గొని

మిక్కిలి ప్రశస్తతరముగా రచనను సాగించియున్నాఁడు. బ్రహ్మారుద్రయ్య, ఖడ్గతిక్కనలలో నొకరిని మించునట్లు మఱియొకరిని జిత్రించి సఫలీకృత మనోరథుఁడైనాఁడు. పాత్రచిత్రణ మనఁగాఁ గేవల మాకారచిత్రణము గాదనియు, నంతస్తత్వ చిత్రణ మనియు ఋజువుచేసినాఁడు చండాలకులజుఁడైన బీరినాయకుని పాత్రమును గూడఁ జక్కఁగాఁ జిత్రించి కరుణరసమును బరిపోషించినాఁడు. ఇతఁడు తిర్యక్కులకుఁగూడ వ్యక్తిత్వమును రూపించి, బొల్లావునకుఁ బాత్రత్వమును గల్పించి చక్కఁగా వర్ణించినాఁడు. ఈ కాటమరాజు కథలోఁ బొల్లావు యుద్ధము మఱపునకురానిది. దాని ఢాకకుఁ జెదరిన మనుమసిద్ధి సైనికుల చేష్టలు, మాటలు మిక్కిలి స్వాభావసిద్ధముగా నుండి మనోజ్ఞమైన దృశ్యమును బ్రదర్శించుచున్నవి. కాటమరాజు కథను వ్రాసిన కవులందఱు పాత్రచిత్రణమున నొక ప్రత్యేకతను బ్రదర్శించిరి. వీరిలో గంగుల పినవెల్లయ యగ్రశ్రేణికిఁ జెందినవాఁడని చెప్పవచ్చును.

---

## కా ట మ రా జు క థ

### (తెలుఁగునాఁటఁ బ్రసిద్ధమైన కథ)

నెల్లూరి పట్టణమును రాజధానిగాఁ జేసికొని నల్లసిద్ధిదేవచోళ మహారాజు దేశమును బరిపాలించుచుండెను. అతనికి రణతిక్కన యను బ్రాహ్మణోత్తముఁడు సేనాధిపతి. ఇతనినే ఖడ్గతిక్కన యని పిలుచుచుండెడివారు. ఆ కాలమున యాదవవంశోద్భవుఁడైన కాటమరాజు, కరియావులరాజు, పోలమరాజు పాలకొండ, లంకమలఁ నల్లమల మొదలుగాఁ గల పర్వతప్రదేశములం దరణ్యములలో గోవులను మేపుకొనుచుండిరి. వారందఱు నీ దేశమునఁ గల పచ్చిక

బీళ్లలోఁ బశువులను మేపుకొనుచుండుటచే, నల్లసిద్ధి మహారాజునకుఁ బుల్లరి రూపమున నాలుకుఁ బుట్టెడు కోడెదూడల నిచ్చుచుండిరి. వారా పర్వతప్రదేశములందుఁ గొంతసైన్యము నుంచుకొని, యంద లాలతో నేనుఁగులతోఁ బ్రసిద్ధివహించి యుండిరి. గోసంరక్షణార్థమై వారు క్రూరమృగముల వేఁటాడి చంపుచుండెడివారు. అది కారణ ముగాఁ బర్వతగుహాలలో నివాసమున్న కిరాతు లా యాదవభూపతు లకు విరోధులైరి.

ఇట్లుండ నొకనాఁడు నల్లసిద్ధి భూపాలుని వేశ్య పెంచుకొను చున్న యొక పెంపుడుచిలుక మేడనుండి తప్పించుకొనిపోయి, యడవిలోనున్న చిలుకలతోఁ గలసి కాటమరాజు గోవులు మేయు చున్న చోటికిఁ బోయినది. ఆ చిలుకలన్నియు బిగ్గరగా నరవ సాగఁగా గోవులన్నియు బెదరి బెల్లాచెదరై పోయినవి. ఆ చిలుక లఱచుచుండఁగాఁ గాటమరాజు పినతండ్రి పోలమరాజు చూచి, యొక బాణముతోఁ గొట్టినాఁడు. ఆ బాణము పెంపుడు చిలుకకుఁ దగిలెను. వెంటనే యా చిలుక మరణించెను. సమీపమున నున్న కిరాతు లా పెంపుడు చిలుకను దీసికొనిపోయి భోగముదానితో జరిగిన వృత్తాంతమును జెప్పిరి. తన పెంపుడుచిలుక మరణించి నందులకు మిక్కిలి చింతించి, యామె కిరాతకులతో "మీరు కాటమరాజు గోవులను వధింపు" డని యాజ్ఞాపించినది. కిరాతకు లచ్చటనుండి పోయి కాటమరాజు గోవులను జంపసాగిరి. అది తెలిసి కొని కాటమరాజు కిరాతకులను గొందఱను జంపెను. నాఁటఁగోలె నల్లసిద్ధి భూపాలున కిచ్చుచుండిన పుల్లరి నిచ్చుటను గూడ మాని వేసిరి. నల్లసిద్ధి భూపతి సైనికుల నంపి పుల్లరి యడిగించెను. కాటమ రాజా సైనికులను లక్ష్యపెట్టక వారిని దృణీకరించి, తఱిమివేసెను.

అట్లు కాటమరాజుచేఁ దఱుమఁబడిన సైన్యము లా వృత్తాంత మును రాజున కెఱిఁగించిరి. వెంటనే నల్లసిద్ధి ముఖ్యసేనాధిపతియైన

ఖడ్గతిక్కనను రావించి, తద్వృత్తాంతం బెఱిఁగించి, కొంతసైన్యము నిచ్చి కాటమరాజుపైకి యుద్ధమునకుఁ బంపెను. కాటమరాజునకు ఖడ్గతిక్కనకు ఘోరమైన యుద్ధము జరిగెను. తుట్టతుదకు ఖడ్గతిక్కన యోడిపోయి గృహమునకు మఱలివచ్చెను.

ఖడ్గతిక్కన భార్యకీ విషయము తెలిసెను. భర్త వచ్చులోపల నామె స్త్రీలుస్నానముచేయు గదిలో నీళ్లు సిద్ధముచేసియుంచెను. భర్త స్నానార్థమై రాఁగా నదిగో యచ్చట స్నానము చేయమని హెచ్చరించినది. దానికిఁ గారణమును తిక్కన యూహించినాఁడు. వెంటనే తల్లి విరిగినపాలతో భోజనము వడ్డించినది. కారణ మడుగగా "ఈ దినము గోవులన్నియు నీవు పోయినస్థలమునకే పోయి విఱిగివచ్చిన" వని చెప్పినది. అందులకుఁ గారణమును తిక్కన యూహించినాఁడు. భోజనానంతరము మఱల సైన్యమును సమకూర్చుకొని యుద్ధరంగమున కఱిఁగినాఁడు. ఉభయపక్షములకు సంకులసమరము జరిగినది. యుద్ధములో ఖడ్గతిక్కన యసువులఁ బాసినాఁడు. అది యెఱిఁగిన ఖడ్గతిక్కన భార్య సహగమన మొనర్చినది. ఈ కథ నాధారముగాఁ జేసికొని కవు లనేకులు గేయకావ్యములను వ్రాసి కాటమరాజు బలపరాక్రమముల నెక్కువగా వర్ణించిరి.

---

# చిత్రాంగి

"ముదుసలులకు, వివాహితలయిన పడుచు పెండ్లముల హృదయములకుఁ, జిత్రాంగి ప్రతీక" మని చెప్పవచ్చును. విమర్శించునది?

లేదా

"చిత్రాంగి యతిలోక సౌందర్యవతియయ్యు దైవోపహత" విమర్శించునది?

లేదా

ధర్మవరమువారి విషాద సారంగధర నాటకమునఁ జిత్రాంగిపాత్ర మెట్లు పరిపోషింపఁబడినదో పరామర్శించునది?

చిత్రాంగి రాజరాజనరేంద్రునికి సామంతుఁడగు భోజరాజు ననుఁగుఁబుత్రిక. అతిలోక సౌందర్యవతి. లోకమోహన మనోహర రూపిణి. రతీసతీసమాదృతమయూరి. ఆమె రాజరాజు పుత్రుఁడైన సారంగధరుని చిత్రపటమును జూచి, తన హృదయము నా మోహనాంగున కంకిత మొనర్చినది. కన్యాన్వేషణార్థమై వచ్చిన విభావసునితో నామె హృదయగతాభిప్రాయమును సారంగధరుని కెఱిఁగింప మని బతిమాలుకొన్నది. కాని దురదృష్టవశమున రాజరాజే యా చిత్రాంగిపటమును జూచి, యామె యందచందములకు ముగ్ధుఁడై, యా మోహనాంగిని వివాహమాడఁదలఁచెను. అది కారణముగా విభావసుఁడా వార్తను సారంగధరున కెఱిఁగింపలేదు. రాజరాజు భోజరాజునకుఁ గబురంపినాఁడు. అతఁడా రాజునకు సామంతుఁడగుటచేఁ గాదనలేకపోయినాఁడు. బలవంతముగాఁ జిత్రాంగికి రాజరాజుతో వివాహము జరిగిపోయినది.

చిత్రాంగి సారంగధరున కంకితమొనర్చిన తన మానసము నాతనినుండి మఱలించుకొనలేకపోయినది. ఆతని చిత్రపటమును దన హృదయసీమ నుంచుకొని కొంతకుఁగొంత యూరడిల్లుచుండెను. మార్గాంతరముచేతనైనఁ దన కోర్కెను దీర్చుకొనవలయునని,

యవకాశమునకై పొంచియుండెను. తాను మనసారఁ గోరిన కోరిక యీడేరనపు డే మానవతియైన నేమి చేయఁగలదు. చిత్రాంగి తప్పు దారుల వెదకసాగినది. ఆమెలోని వాంఛ తీరనివాంఛ. దైవవశమున నామె కొక చక్కని యవకాశము చిక్కినది. రాజరాజు వేఁటనిమిత్తమై వింధ్యాటవి కేఁగవలసి వచ్చినది. అతఁడు చిత్రాంగి యంతఃపురికి వచ్చి, యామెతో నా వృత్తాంతమును వెలిపుచ్చినాఁడు. మంచి యవకాశ మేర్పడినదని యామె మిక్కిలి సంతసించినది. రాజరాజుపై లేనివలపులఁ గురియించుచుఁ దన్నుఁగూడ వేఁటకుఁ దీసికొని పొమ్మన్నది. అతఁడు లేనిదే జీవింపఁజాలనని యెన్నో కల్లిబొల్లి కబుర్లు చెప్పినది. ఎట్టకేల కా భూపాలుఁ డామె నోదార్చి వేఁటకుఁ బోయినాఁడు.

చక్కని యవకాశ మేర్పడినదిగదా యని చిత్రాంగి హృదయము ఉరకలు వేయసాగినది. దైవముగూడ నామె దుష్టసంకల్పమునకుఁ దోడ్పడినాఁడు. ఆమె మిక్కిలి సాహసించి, తనకునచ్చిన నెచ్చెలియైన కమలను రావించి, యొక కమ్మను వ్రాసియిచ్చి, దానిని సారంగధరునికిఁ జేర్చుమని చెప్పినది. ఆ జాబును వ్రాయుటలో నామె ప్రదర్శించిన నేర్పసామాన్యమైనది. ఆ లేఖలో నుల్లేఖింపఁబడిన పాదముల నాద్యంతాక్షరములఁ బఠించినచో నా ప్రణయినికి సారంగధరునిపైఁ గల హృదయము వ్యక్తము కాఁగలదు. కాని దురదృష్టవశమున నా కమ్మ కమల దగ్గఱనే యుండిపోయినది.

ఆమె హృదయములోఁ బీఠము వేసికొని యాసీనుఁడై యుండిన కుసుమాయుధుఁడు సుమాశుగములచే నా కోమలాంగిని దాడింపఁ జొచ్చినాఁడు. ఇంతలోఁ దటాలున సారంగధరుని పావురమా మెమేడపై వ్రాలినది. అంత నా వారిజాక్షి యా పారువము సారంగధరుని దని తెలిసికొని బంధించినది. అది కారణముగా నా రాకుమారుని దన యంతఃపురమునకు వచ్చునట్లు చేసికొనినది.

నెచ్చెలుల నందఱం దటిమివైచి, తానొంటరిగా నా పారువముతో ముచ్చటలాడుచు నుండినది.

ఇంతలో సారంగధరుం డా పారువమును వెదకుచుం బినతల్లి మేడకు వచ్చినాఁడు. తల్లికి నమస్కరించినాఁడు. అతఁడు వచ్చిన వెంటనే యామె యాతనిని లోనికిఁ దీసికొనిపోయినది. "బహుదినములనుండి నీపై నాకుఁ గడుప్రేమ. ఆ రాజును వేఱు, నిన్ను వేఱుగఁ జూచెదనా" యని నర్మగర్భముగ నాతనితో మాటలాడినది. ఫలాహారమిడ చే నాతని కవచాదులఁ దీయించినది. వేఁడుకలు జూపించు నెపమున శయ్యాగారమునకుఁ దీసికొనిపోయినది. నీ కోర్కెల నిచ్చట స్వేచ్ఛగా నెరవేర్చుకొనవచ్చునని హెచ్చరించినది. ఇదియే నీ పడకటిల్లుగా భావించుకొమ్మని బతిమాలినది. బహువిధములఁ బ్రయత్నించి చూచినది. విఫలమనోరథ యైనది. ఇఁక లాభము లేదని తన హృదయమును బహిరంగముగ విప్పిచెప్పినది. నీవు చేయునది పాపకార్యమని యాతఁడు మందలించినాఁడు. కుంతి మొదలుగాఁ గల పురాణనాయికల దృష్టాంతముగఁ జెప్పి తన నడవడికను సమర్థించుకొనుటకై ప్రయత్నించినది. చిత్రాంగి ప్రయత్నములన్నియు వమ్మైనవి. ఎట్టకేలకుఁ దమి కాగలేక యాతనిని గాఁగిలించుకొనఁబోయినది.

సారంగధరుం డామె సాహసమున కియ్యకొనక, యుత్తరీయమునుగూడ నచ్చటనే విడిచిపెట్టి, వెడలిపోవ నుపక్రమించినాఁడు. ఆమెను దిరస్కరించి వెడలిపోవుట కుపక్రమించియున్న సారంగధరు నామె పలువిధముల బెదరించినది. "మానిని సాహసించెనా యది యొనర్పఁజాలని కార్యమే యుండదు. నా మనోధనము నపహరించితివి. దాని ననుభవింపకయున్న నిన్నుఁ దక్కనీయను సుమా!" యని బెదరించినది. కాని శీలసంపన్నుఁడైన సారంగధరుం డామె బెదరింపులను లెక్కపెట్టక యచటువాసి గృహోన్ముఖుఁడయ్యెను.

ఆ క్షణమునుండి చిత్రాంగి పగఁబట్టిన త్రాచువలె నాతనిపై బుసలు కొట్ట సాగినది. భర్తతోఁ జెప్పి సారంగధరుని జిత్రవధఁ జేయింప వలయునని నిర్ధరించుకొన్నది.

మఱునాఁ డరుణోదయంబున రాజు వేఁటనుండి మఱలివచ్చి నాఁడు. రాజరాజును "మామా" యని సంబోధించినది. నిన్నటితోఁ బోలుతటివావి నాకుఁ దప్పినదని చెప్పినది. పాపము సారంగధరునికి మాతృతల్పగమన మను దోషము నంటఁగట్టి రాజు మనస్సును మార్చివైచినది. యుక్తాయుక్త వివేకహీనుఁడై రాజు పుత్రునిపైఁ బగఁగొన్నాఁడు. రాజులో రగులుచున్న కోపమును బ్రజ్వరిల్లఁ జేయుటకుఁ గల్లబొల్లి కబుర్లు చెప్పసాగినది. సారంగధరుని యుత్తరీయము వెలికిఁదీసి యీ యుత్తరీయము నా వృత్తాంతమును జెప్పఁ గలదని హెచ్చరించినది. మిక్కిలి గడుసుదనముతో నాతని కరవాలమును లాగికొని, తన కంఠమును నఱకుకొనఁ బోయినది. అంత రాజు చిత్రాంగి మాటలను విశ్వసించి, సారంగధరుని భుజ పాదఖండనము గావింపుఁడని తలవరుల కాజ్ఞాపించినాఁడు.

ఇప్పటికిఁ జిత్రాంగికిఁ గసి దీఱినది. కాని దురదృష్టవశమున రాజరాజా మె దుశ్చేష్టలను దెలిసికొనినాఁడు. సారంగధరుఁ డమాయకుఁడని వాపోయినాఁడు. వెంటనే తలవరులతో నీ దుర్జాతి శవమును గోటవాకిట మూఁడు దినములు కట్టియుంచి, పిదపఁ గుక్కలకు వేయుఁడని యాజ్ఞాపించినాఁడు. ఇట్లు సారంగధరునితోఁ గలయికకై కలలుగన్న చిత్రాంగి తుదకు దుర్మరణము పాలైనది. పాప మామె దైవోపహత. ఆమెలోని తీరని వాంఛయే నామెచే నన్ని దుష్కార్యములఁ జేయించినది. అది యామెలోపల నావే శించిన మన్మథపిశాచము తప్ప. ముదుసలులకు వివాహహితలైన పడుచు పెండ్లముల హృదయములకు నామె ప్రతీకము.

ఈ క్రింది వాక్యములకు సందర్భ సహిత వ్యాఖ్య వ్రాయుడు.

1. "చేసికొన్నవారికిఁ జేసికొన్నంత మహాదేవ" యని వారూ అట సెందినారు.
2. ఇల్లాలి నొల్లనివారికి వెలయాలు మగనాలు.
3. "నాతోఁ బెనంగిన నయమేమి లేదు.
కడువడిఁ గలనికిఁ గదలుఁడి మీరు"
4. "నేను భాజనగతాన్నమును. ఎక్కడికిఁ బోఁగలను."
5. "కష్టుండో నివ్వాలి నొక్కవేల్పు గణియించిన పాతకినొదు".
6. కప్పురంబు వెట్టి యుప్పుగొనుట".
7. "నాకును మంగళసూత్రంబీపాటి శుభస్థితినుండుట పదివేలు"
8. సిగ్గు జోహారుచేసి తొలఁగి నిలిచినది.
9. మగఁడు చెప్పి తాను దెలిసికొనలేదు. తానడిగి తెలిసికొన లేదు.
10. ఆమెలోని వాంఛ తీరని వాంఛ.
11. దైవముగూడ నామె దుష్టసంకల్పమునకుఁ గలసివచ్చెను.
12. ఎన్ని పద్మినులపై నీ కాయశట్టద మిదినటకుఁ దిరుగాడి యున్నదో?
13. "మానిని సాహసింపఁ దొడఁగెనా యది యెనర్పఁజాలని కార్యమే లేదు".
14. ముదుసలులకు వివాహితలైన పడుచు పెండ్లములకు నామె ప్రతీకము.

---

Victory Press, Nellore-2.